# CONTENTS.

# విషయసూచిక.

# PREFACE.

*(First Edition.)*

THE story of Sita and Sri Ramachendra has a peculiar hold on the Hindu mind nurtured on domestic and social ideals from its infancy. These ideals have been represented in this little volume in a setting that at once captivates the Indian Student whose leanings are towards modern materialism on account of our inevitable contact with the West. We cannot do better than to quote the following extracts from the writings of two great Indians, to show in what esteem Sita and Rama are held throughout India as the very embodiments of all human virtues.

" And what to speak of Sita ? You may exhaust the literature of the world that is past, and I may assure you, you will have to exhaust the literature of the world of the future, before finding another Sita. Sita is unique ; that character was once depicted and once for all. Ramas have been perhaps, several, but Sitas never. She is the very type of the Indian woman as she should be, for all the Indian ideals of a perfected woman have got around that one life of Sita, and here she stands, these thousands of years commanding the worship of every man, woman or child throughout the length and breadth of the land of Aryavarta. There she will always be, glorious Sita, purer than purity itself, all patience and all suffering. She who suffered that life of suffering without a murmur, she the everchaste, the everpure wife, she the ideal of the people, the ideal of the Gods, the great Sita, our national God she must always remain and every one of us knows her too well to require much delineation. All our mythology may vanish, even our Vedas may depart, and our Sanskrit language may vanish for ever, but as long as there will be five Hindus living here speaking the most vulgar ' patois ' there will the story of Sita be present, mark my words ; Sita has gone into the very vitals of our race. She is in the blood of every Hindu man and woman ; we are all children of Sita." —*Swami Vivekananda.*

If Rama, the ideal of social and domestic virtues, the miracle of gentleness, goodness and valour, of heroism tempered with humility and prowess combined with mildness, a lion in war and a lamb in peace, the ideal lover, who wept torrents at his separation from Sita, but the dignity of whose character was such, that he would not take her back unless her chastity was publicly vouched for by the gods above, who wept almost to death on the lap of his apparently dead Lakshmana, but only a few days after extinguished, by a single arrow, Ravana, the tyrant of all the worlds, the " Suddha Brahma Paratpara Ram " at whose very sight the universe melts away, trembling like a ghost at sunrise but who is dear to poets and Bhaktas in his human form, blue like the sky holding the Kodanda (his bow) in his hand and wa king the earth like a poor ascetic, the sweet Ramamurti, whose name being the *taraka mantra*, is in the heart of every pious Hindu from the Himalayas to the Cape. If he is not God, who else could be ?

—*B. R. Rajam Iyer.*

The Educational World is resounding with the cry that the Vernaculars should be made the medium of instruction in Indian Schools, and the Minister of Education has recently expressed himself in favour of its early introduction.

The lives of the National Heroes of the West are taught in Indian Schools in a foreign language, whereas the lives of the Indian National Heroes are not taught. Therefore they are not written either in English or in the Vernaculars. In order to meet the demand for Vernacular Text-books written in chaste, simple and fluent style, we have already published the "*Lives of Bharata Heroes*" which was approved by the Text-book Committee and introduced as a Text-book in many High Schools of the Andhra Country.

We intend publishing a series of Vernacular books on the same model, useful for male and female pupils of schools, and we have, accordingly, brought out the life of

Sita, the Ideal of Indian Womanhood, in a noval form in simple and chaste prose, under the attractive title of "JANAKI DEVI". We shall feel our endeavours rewarded in some measure, if its worth and value are recognized by the Public and the Educational Authorities.

The opinions of distinguished Scholars and Educationists on the book are appended.

We express our gratitude to Brahmasri Pandit Bulusu Papayya Sastry Garu of Anakapalli, for the help he has rendered us in this publication.

MASULIPATAM,
*25th October 1922.* PUBLISHERS.

---

## (SECOND EDITION.)

We are extremely thankful for the recognition of our publication "JANAKIDEVI" by the Educational Department and the Educationists of the country. This little volume was approved by the Text-book Committee, Madras, as a Text-book and the Commissioner for Government Examinations has been graciously pleased to prescribe this as a Text-book for the Lower grade Training Public Examination of this year. Hence the present second edition. We are deeply indebted to the authorities and the Head Masters of the several institutions for the kind help rendered by them in our enterprise.

MASULIPATAM,
*21st October 1924.* PUBLISHERS.

# విజ్ఞప్తి.

శ్రీరామ కథ నెవ్వరెన్ని తెలుఁగుల వ్రాసినను దనివితీఱని దగుటచే నిదివఱ కెందఱో రామాయణ గాథలను గద్య పద్యాత్మికములుగ బ్రచురించినను మేమును యథాశక్తిని బ్రచురింప సాహసించినందులకు పాఠక మహాశయులలుగకుందురుగాక !

ఇంతకుమున్ను వ్రాయఁబడిన వన్నియుఁ గావ్య ప్రబంధశైలి ననుకరించుటచేఁ బండిత జనాహ్లాదకరంబు లయ్యెఁగాని పాఠశాలా విద్యార్థులకు సులభ గ్రాహ్యములు కాకుండుటచే వానికి విద్యాలయములలోఁ దగినంత వ్యాప్తి కలుగదయ్యెను. ఇటీవలఁ గొన్ని గ్రంథములు రచింపఁబడిన నవి ప్రైమరీ పాఠశాలా విద్యార్థులకు మాత్రమే పఠన యోగ్యంబు లగుటచే నవియు నంతగా నున్నత విద్యాలయముల (Secondary Schools) లో బ్రచారము గాంచవయ్యెను. ఈ కొఱఁతను బాప లలితమై, సహజ వర్ణనా శోభితమై, సలక్షణమైన శైలిని నవల రూపమున నుపయుక్తముగు తెలుఁగున " శ్రీజానకీదేవి " దివ్య చరిత్రమును రచింపించి ఆంధ్ర విద్యార్థుల హస్తముల నిడుచున్నారము.

ఇందు శ్రీ జానకీదేవి యుత్తమ చరిత్ర మతి మనోహరంబుగ వర్ణింపఁబడి పాఠకుల మనంబులలో భారతదేశమున కెల్ల మహా పూజనీయంబగు పాతివ్రత్య మహిమము, భ్రాతృ వత్సలత, పితృ భక్తి, ధర్మ నిర్వహణము, దీనా

వన పరతత్వము, సత్య నిష్ఠ మున్నగు యున్నత ధర్మములు రమ్యంబుగ బాల బాలికల మనంబున నాటునటుల నా యా సందర్భోచితముగ జిత్రింపబడినవి. పిన్న వయస్సున నిట్టి గ్రంథముల బఠించు విద్యార్థుల జీవితంబులు యుత్తమోత్తమంబులై యాదర్శప్రాయంబులై వెలుంగగలవని మాయాశయము.

ఈ చిన్న పుస్తకముపై గొందఱు పండితాగ్రేసరులు తమ యుదార భావములఁ బ్రకటింపుచు దయచేసిన యాదర పూర్వకాభిప్రాయములను వందన శతంబులతో నందుకొని యిందు బొందుపఱచితిమి. ఈ పొత్తమును శ్రమను పాటింపక నా మూలాగ్రముగఁ బరిష్కరించి మమ్మాశీర్వదించిన అనకాపల్లి వాస్తవ్యులు బ్రహ్మశ్రీ బులుసు పాపయ్య శాస్త్రిగారికి మా హృదయపూర్వక వందనము లర్పించుచున్నారము.

మచిలీపట్నం,
1922 సం॥ 25 అక్టోబరు.

ఇట్లు విన్నవించు భాషా సేవకులు,
రాంజీ కంపెనీ.

---

# కృతజ్ఞత.

ఈ ‘‘ జానకీదేవి ’’ పొత్తమును జిత్తగించి ప్రోత్సాహ జనితమగు అభిప్రాయములను పెక్కు విద్వాంసులు వెల్లడించి మా యుద్యమమున యధికోత్సాహమును గలిగించి నందులకు వారెల్లరికి మా కృతానేకనమస్కారములు జేయుచున్నాము.

ఈ చిన్న గ్రంథమును మద్రాసు పఠనీయ గ్రంథ నిర్ణయసంఘము (Madras Text-Book Committee) వారు పఠనగ్రంథముగా నంగీకరించి (ది. 24-7-1923 తేదీ పోర్టుసెంటు జార్జి గెజిటె)యు, గవర్న మెంటు పరీక్షల కమీషనరుగారు (Commissioner for Government Examinations) దీనిని ఎలిమెంటరీ లోవరుగ్రేడు ట్రెయినింగు పరీక్షకు పఠనీయగ్రంథముగ నిర్ణయించి ప్రోత్సాహము గలిగించినందుననే యింతత్వరలో నీ రెండవ కూర్పు ముద్రణకు హేతువైనదని విన్నవించుచు మా కృతజ్ఞతను వెల్లడించుచున్నాము. ఎల్లరు పూర్వముకంటె నెక్కువగ నాదరించుటకు కోరుచున్నాము.

మచిలీపట్నం,
1924 సం॥ 21 అక్టోబరు.

భారతీసేవకులు,
రాంజీ కంపెనీ.

# OPINIONS.

# పండితాభిప్రాయములు.

(1) బ్రహ్మశ్రీ చెళ్ళపిళ్ళ వేంకట శాస్త్రులుగారు, సుప్రసిద్ధ శతావధానులు, కడియం :—

మీరుపంపిన "జానకీదేవి" అను పొత్తమును అక్కడక్కడ చదివి చూచినాను. చక్కని శైలిలో నిర్దుష్టస్థితిలో నున్నది. స్కూలులో చదువు బాలురకు వ్యాసరచనాభ్యాసమునకు మిక్కిలిగ తోడుపడుననుట నిర్వివాదాంశము. ఇదియే నాముఖ్యాభిప్రాయము.

(2) మహారాజశ్రీ కూచి నరసింహము పంతులుగారు, B.A., L.T., పిఠాపురం:—

తాము దయతో నంపిన 'జానకీదేవి' యను గ్రంథము నిన్న నందినది. అందులకనేకవందనములు. పుస్తకము చదివినాను. రామాయణకథ యుత్తరరామాయణ గాథతోఁగూడ సంక్షిప్తముగా వ్రాయఁబడియున్నది. భాషబాగుగా లక్షణయుక్తముగా నున్నది. కరుణారసప్రధానములైనపట్ల చక్కఁగా హృదయంగమముగా వర్ణింపఁబడినవి. ఇట్టి యవతారపూరుషుల చరిత్రలు బాలురు శైశవమునలోఁ జదువుట మిగుల శ్రేయస్కరమని తలఁచెదను.

(3) శ్రీరాజా విక్రమదేవవర్మగారు, విశాఖపట్టణము :—

మదీయాశయంబునకై నాకడకుం బంపంబడిన "జానకీదేవి" యను పొత్తమును జదివి కడుమోదమొందితిని. దానికళేబరము చిన్నదియేయయిన నందించుమించుగా రామాయణ మహాకావ్యమందలి కథయంత

యుఁ గ్రస్తముగాను సుబోధముగాను వివరింపంబడియున్నది. దాని శైలి మృదులమును సులభమును. అది పాఠశాలలందుఁ బాఠ్యపుస్తకముగానుండుటకేకాక, గృహిణుల కాలక్షేపమునకు నుపయుక్తముగా నున్నది. కనుకఁ దత్కర్తలు దగుప్రోత్సాహము నొందఁగలరని నావిశ్వాసము.

(4) బ్రహ్మశ్రీ నాదెళ్ళ పురుషోత్తమ శాస్త్రిగారు, మచిలీపట్టణము:—

'జానకీదేవి' యను పేరిటనున్న పూర్వోత్తర రామాయణ కథా సంగ్రహమును జదివితిని. ఇది కఠినముకాకుండ యొప్పిదమగు వచనమున్న నున్నందునఁ బాఠశాలలలోని బాలురును బాలికలును జదువుటకు మిగుల నుపయోగకరమగునని యెన్నఁదగి యున్నది.

(5) బ్రహ్మశ్రీ జనమంచి శేషాద్రిశర్మగారు, కడప హైస్కూలు ప్రధానోపాధ్యాయులు :—

తమరనుకంపతోఁ బంపిన "జానకీదేవి" అను గ్రంథము నచ్చట చ్చటంజదివి పరిశీలించితి. భాషాశుద్ధి చక్కఁగనున్నది. కథాసంవిధానము సరిగానున్నది. శైలిమృదుమధురము. పాకము ద్రాక్షాపాకము. ప్రకరణవిధానము సమంజసముగ నున్నది. మీపరిశ్రమము సార్థకమగుఁ గాక! ఇయ్యది మీకనంత శ్రేయోదాయకమగును గాక! సమయాను సారముగా నందందుఁ జేర్కొనఁబడిన పద్యములు కడుంగడుహృద్యములు. ఆంధ్రలోకమీ గ్రంథము నాదరించుఁగాక!

(6) మహారాజశ్రీ రాయసము వెంకటశివుఁడు పంతులు గారు, M.A., L.T., నెల్లూరు, వెంకటగిరి రాజాగారి కాలేజి ప్రిన్సిపాలు :—

క్రొత్తగా ప్రచురింపఁబడిన "జానకీదేవి" యను ఈపుస్తకమునందు సీతచరిత్రము ఇంపగునట్టిరీతిని నాతికఠినమగు శైలిలో వర్ణింపఁబడినది. యువకులు పఠించుటకిది యనువుగనున్నదని తలంచెదను.

(7) బ్రహ్మశ్రీ కేతవరపు వెంకటశాస్త్రిగారు, విశాఖపట్టణము హైస్కూలు ప్రధానాంధ్రోపాధ్యాయులు :—

తమరంపిన "జానకీదేవి" యను వచనగ్రంథము చేరినది. తుదదాకఁ జదివితిని. ఇతివృత్తము ప్రసిద్ధముగుటచేతను, శైలిసులభమై మృదుమధురమై, యనర్గళమై యుండుటచేతను, స్త్రీలును బాలురునుగూడఁ జదివి యానందింపఁగలరని నానమ్మకము. ఇందలిభాష నిర్దుష్టమై సాధుచరిత యను జానకీదేవి చరిత్రమును బురుడించుచున్నది. * * * *

(8) శ్రీమాన్ గొ. జగన్నాథస్వామిగారు, M.A., L.T.. కాకినాడ, పిఠాపురం రాజాగారి కాలేజి హెడ్మాస్టరు :—

తమరుపంపిన 'జానకీదేవి' యను పుస్తకమును, అందునుగూర్చి పంపిన జ్ఞాపికయును జేరినవి. గ్రంథశైలి హృద్యముగానున్నది. కొంచెము సంస్కృతపదము లెక్కువగనున్నను, మొత్తముమీఁద నాతిక్లిష్టము. కథాసన్నివేశము రమ్యముగానున్నది. అచ్చటచ్చట వాల్మీకిని స్మరింపఁ జేయును. హృదయంగమమగు నీపుస్తకము పాఠశాలలలోనున్నత తరగతుల కుపయుక్తము కాఁగలదని నాయభిప్రాయము. బాలికలకును మిగుల సమ్మతమై యుండఁగలదు.

(9) శ్రీ మున్షీ ఉమర్ ఆలీషా కవిగారు, పిఠాపురం:—

కం॥ శ్రీరామ చరితవవలగ
ధీరత రచియించినట్టి ధీశాలిని మే
మూరక నుతింపవలెనా
యీరేడు జగములతఁడు తరించెనుగాదే ॥

కం॥ మీవచనశైలికడు స్వా
భావికమై ముద్దులొలుకు భావంబులతో
కేవలరసభరితంబయి
ప్రావీణ్యతఁజూపుచుండె రాంజీరాయా ॥

(10) మహారాజశ్రీ నందూరి మూర్తిరాజు పంతులు గారు, B.A., కాకినాడ :—

అభిప్రాయార్థము మీరు పంపించిన "జానకీ దేవి" అను పుస్తకమును జూచినాను. రామాయణమునందలి ఉత్తమగాథను, నవల రూపమున, కేవలము గాని చక్కని శులభశైలిని, బాలురకు, స్త్రీలకు నత్యంతోపయుక్తంబుగా మీరు రచించిరి. * * * *





శ్రీ

# జానకీదేవి.

## మొదటి ప్రకరణము.

### *క్రతురక్షణము.*



పట్టపగలైనను సంధ్యాసమయమైనట్లే తోఁచుచుండెను. వృక్షమునకును, వృక్షమునకును నెడము లేకుండుట చేత, భానుండందుఁ బ్రవేశించుటకు శక్తుఁడుగాకుండెను. బాటసారుల గుండెలు పగులునట్లు సింహనాదంబులు వినఁబడుచుండెను. అడుగడుగునకును నేప్రక్కఁ జూచినను, వ్యాఘ్రంబు లీపొదనుండి యాపొదలోని కేఁగుచుండెను. వానరములు తమ తమ బిడ్డలు కడుపుల నత్తుకొన నీచెట్టుపైనుండి యాచెట్టుపైకి దూకుచుండెను. అంతటను "గుయ్" మను శబ్దము విన

వచ్చుచుండెను. వృక్షంబులు దట్టంబుగా నల్లుకొని వంగి యుండుటచేత, నొక్కొక్క స్థలమునందు బాటసారులు వంగి నడవవలసి వచ్చుచుండెను. వేయేల? రాజభయంబునఁగాని, చోరభయంబునఁగాని, కలఁతఁజెందు క్రూరులు దాఁగియుండుట కా యరణ్యమును బ్రహ్మ సృజించెనని చెప్పఁదగియుండెను.

ఇట్టి మహారణ్యంబున మధ్యాహ్నము మూఁడుగంటల సమయంబున, మువ్వురు పురుషులేఁగుచుండిరి. అందొకని వయస్సు మాత్రము, నిర్ణయించుట యించుక కష్టము. కాని యాతని సుందర విగ్రహంబును, శరీరదార్ఢ్యంబును, జూచినచో నాతఁడు నలువది వత్సరంబులకు మించనివాని వలెఁ గన్పట్టును. ఆతని హస్తమున దండకమండలువులును, మోకాలివఱకు వ్రేలాడు జటాభారంబును, వక్షస్థలంబుతో వియ్యమందు గడ్డంబునుఁ దిలకింప నతండొక మునీశ్వరుండని యూహింపకమానరు. ఆ మునిచంద్రుని వెనువెంటఁ జనుచున్న యా యిరువురును సమాన వయస్కులు. మార్గమధ్యంబున వారిరువురును, సంభాషించుకొను నప్పుడు, "అన్నా, తమ్ముఁడా" యని యొకరి నొకరు పిల్చుకొను మాటలనుబట్టి వా రన్నదమ్ములని తెలియఁదగియుండెను. వారి నూనూఁగుమీసముల తీరును, నాజానుబాహువులను, సంపూర్ణ పూర్ణిమాక్షపాకరునకు వంకలదిద్దు ముఖంబుల సొంపును, వారి హస్తంబుల రాజిల్లుచున్న వాఁడిగల ఖడ్గంబులను, జూచినచో వారు రాజకుమారులని చూపఱు తలంపక

మానరు. వారి వయస్సప్పటికిఁ బదియాఱు వత్సరంబులని చెప్పవచ్చును. వీరిరువురును నా జడదారివెంట నే కార్యము కొఱకేఁగుచుండిరో తెలియదు; కాని మార్గంబున నా మునియును, రాజకుమారులును, నీ విధమున సంభాషించుకొనుచుఁ బోవుచుండిరి.

ముని :— కుమారులారా! ఇప్పుడు మనము వింధ్యారణ్యముఁ బ్రవేశించినారము. ఇచ్చోటు మొదలుకొని మనము చేరఁబోవు స్థలమువఱకు నియ్యరణ్యమంతయు రాక్షసులు సంచరించు భూమి. కావున మీరతిజాగరూకులై యుండవలయును.

రాజ-కు :— గురువర్యా! మీ యనుగ్రహంబున, సమస్తాస్త్ర విద్యలను గాంచినారము. ఆఁకలి దప్పు లడంగుటకై మీరు మాకు బలాతిబల లను విద్యల ననుగ్రహించినారు. ఇంక భూలోకంబున నున్న దానవులందఱును నేకంబై యెత్తివచ్చినను భయంబందువారము గాము. మీ కృప మాపై నున్న మాకేమిభయంబును గలుగదు.

ముని :— మీ ధైర్యస్థైర్య గుణంబులు నాకు సంపూర్ణముగఁ దెలియును. కాని నిరంతరంబును ననేక సేవకులు గొలుచుచుండ, మణిమయ సౌధంబులయందు నాటలాడుకొను మిమ్ము ఘోరారణ్య భూములందుఁ ద్రిప్పుచున్నాను గదాయని మాత్రము చింతించుచున్నాను.

రాజ-కు :— మహాత్మా ! మీా రట్లనవలదు. ఈ యరణ్య భూములయందు సంచరించుట మాకు సౌధ నివాసము కన్న సంతోషదాయకముగ నున్నది. ఇంతియకాక, యనేక వత్సరంబులు గురుశుశ్రూషగావించినను బడయరాని ధనుర్విద్య యంతయు నొక్క దినములో మా కొసంగిన మీా యమూల్య కరుణను మే మేమని కొనియాడుదుము.

ఇట్లు వారు సంభాషించుకొనుచుఁ గొంతదవ్వరుగునప్పటికి ‹‹ ఓహో ! చిరకాలమునకు నా కంటికి నరు లగపడినారు. వీరిని నేఁడు వధించి తృప్తిదీఱ విందు గుడిచెద ” నను సింహనాదంబును బోలిన భీకరపుఁ కేకలు వారికి వినవచ్చెను. ఆ కేకలకు సహజ ధైర్యశాలులగు రాజకుమారులొక్కింతయుఁ జలింపలేదు. కాని యా యుదంతంబును దెలిసికొనఁగోరి, రాజకుమారులందగ్రజుఁడు జడదారింజూచి, ‹‹ మహానివర్యా ! ఆ వాక్యంబు లెవ్వరివి ? దాని నెఱుంగనగునేని, యెఱిఁగింపఁగోరెద ” నని యడిగిన, మునీంద్రుండతనిం జూచి, ‹‹ వత్సా ! ఇదియొక రక్కసి. దీనిని దాటకయందురు. యజన విఘ్నకారణుండైన మారీచునకుఁ దల్లి. ఇయ్యది మార్గంబుల నరికట్టి జనంబులఁ జంపుచుండును. నేను యజ్ఞమాచరించు సమయంబున నిదియు నరుదెంచి విఘ్నము గలిగించుచుండును. కావున నింక నీవు సందియంబందక యీా దుష్టనిశాటిని నీయమోఘాస్త్రంబుచేఁ బొలియింపుము ” అని బోధించెను. ఆ మాట వినినంతనే,

యా రాజకుమారునకుఁ దాటకాసంహారము తృణప్రాయమే యైనను, స్త్రీవధ నెట్లు జేయుదునని సంశయముగలిగెను. ఆతని సంశయకారణంబు మునిచంద్రుఁడెఱింగి, "బాలకా! నీ మనంబునఁ గలిగిన సందియంబునకుఁ గారణంబు నెఱింగితిని. స్త్రీవధ వలనఁ బాపంబు సంభవించునని శంకింప వలదు. జగద్రక్షణార్థమై పాపమతియగు స్త్రీని జంపవచ్చునని ధర్మశాస్త్రంబులు చెప్పుచున్నవి. మున్ను జగదపకారిణియగు భృగుపత్నిని శౌరి దునిమెను. విరోచన సుతను బురందరుఁడు వధించె. నీవు చేయఁబోవు కార్యము లోకోపకారార్థము. కావున సందియంబందక జనహంత్రియైన యీ నిశాటిని గూల్పు" మనెను. అంతట దుష్టనిశాటీ వధోద్యోగంబునకుఁ బ్రోత్సాహ పఱుపఁదలంచి తమ్ముండగ్రజునిఁ జూచి, "అన్నా! మునివాక్యంబుల వింటివి గదా! ఈతని వాక్యములే మనకు వేదవాక్యములు. అదియుంగాక, మన మరుదెంచునప్పుడు జనకుండు మనతో మునివర్యుఁ డెట్లుచెప్పిన నట్లుచేయుఁడని యాజ్ఞ నొసంగి యున్నాఁడు. కావున సందియంబందక దీనిని సంహరింపు" మనెను. మునీంద్రుని వాక్యంబులును, దమ్ముని పలుకులును, విని యాతఁడు తాటక వధోన్ముఖుఁడయ్యెను.

ఇంతలో నా రక్కసి, వీరి మువ్వురనుఁజూచి భయంకర రూపంబునఁ బ్రతిధ్వనులిచ్చునట్లు కేకలిడుచు, భూమి బ్రద్దలగునట్లు పదవిన్యాసమొనర్చుచుఁ బైకివచ్చుచుండ, రాజకుమారుండించుకయుఁ జలింపక, చాపంబు నెక్కువెట్టి,

మునీశునాజ్ఞఁగైకొని, బాణంబు విడిచి, యా రక్కసిని విగత జీవంజేసె.

అప్పుడు, సంధ్యాసమయంబగుటంజేసి, యా మునీంద్రుఁడు రాకుమారులతో నిసియందు నరణ్యంబునఁ బ్రయాణముసేయ నిష్టములేనివాఁడై యా రాత్రి, కచ్చటనున్న యొక్క వటవిటపి క్రింద విశ్రమించి, మఱునాఁడుదయంబున బయలుదేఱి నిజాశ్రమముఁ జేరెను.

అచ్చట నీ మునీంద్రుఁడు రాకుమారులంజూచి యిట్లు పలికె. “కుమారులారా! ఇది మదీయ పుణ్యాశ్రమము. నే నెప్పుడు క్రతువుసేయఁ బ్రారంభించినను, మారీచ సుబాహులను రక్కసు లరుదెంచి దానికి విఘ్నము గలిగించుచుందురు. మీరిప్పుడెట్లయిన నా ముక్కడి రక్కసుల నుక్కడించి, సవనరక్షకులుగండు.”

ఈ పలుకుల విని, రాకుమారులయం దగ్రజుఁడు తాపస పుంగవునిఁ జూచి, “తాపసోత్తమా! మీరు సంశయింపఁ బనిలేదు. యజ్ఞదీక్షఁ బూనియుండుఁడు. దానికి విఘ్నము సేయవచ్చు రాక్షసులను వధించి మఖంబు గాపాడెద” నని నుడివెను. అంతట నమ్మునీంద్రుఁడు దీక్షఁబూని యజ్ఞంబుసేయఁ బ్రారంభించెను. అన్నదమ్ములైన యా రాజనందనులు మునీంద్రుని యాగంబును రక్షింపవలయును గావున నతిజాగరూకతతో నుండవలయునని మాటలాడుకొని, ధైర్యమును బూని, శరశరాసనధారులై యాశ్రమ

ద్వారంబున నేమఱక నిలిచియుండిరి. ఇట్లుండ సప్తమదివసం బునఁ గ్రతుభంగము సేయఁదలంచి మారీచ సుబాహులను రక్కసు లరుదేర రాకుమారుం డించుకంతయుఁ జలింపక వారిరువురిపైఁ దన యమోఘాస్త్రంబులఁ బఱపెను. ఆతని బాణంబున విద్ధుఁడై సుబాహుఁడు నేలఁగూలెను. మారీచుఁడుఁ జలధియందుఁ బడెను. ఇట్లు యజ్ఞంబు పూర్తి యయ్యెను. క్రతు సమాప్తియైనందులకుఁ, దాపసుని చిత్తంబునఁ గలిగిన యానందంబునకు మేఱలేకుండెను. ఆ కుమారుల ప్రతాప మవర్ణ్యముగా నుండెను. వారి ఋణంబెట్లు దీర్చుకొందునని యాలోచించి, ముని వారిం జేరి “కుమారులారా ! మీ జనకుఁడు మిమ్ము నాతోఁ బంపినందుకు, మీరు క్రతురక్షణ మొనర్చినారరు. ముల్లోకంబులను గంపింపఁజేయుచున్న దానవుల గూల్చితిరి. మీ శౌర్యంబు వినుతించుటకు నాకు శక్తిచాలదు. ధరాభారాపనోదార్థమై యవతారమెత్తిన పుణ్యమూర్తులరు గాని మీరు సామాన్య మానవులుకారు” అని వినుతించెను.

# జానకీదేవి.

## రెండవ ప్రకరణము.

### * శాపవిమోచనము. *

"గురువర్యా! అటుచూడుడు! భూపతులెందఱో చతురంగ బలసమేతులై యరుగుచున్నారు. వీరందఱు నెచ్చటికిఁ బోవుచున్నారు" అని రాముఁడు విశ్వామిత్రుని నడిగెను. విశ్వామిత్రుఁడు రాముని విలోకించి "వత్స రాఘవా! మిథిలాపురాధీశ్వరుండైన జనకునకు జానకి యను నొక కూఁతురుగలదు. ఇప్పుడా భూధవుఁడు జానకీ స్వయం వరంబును జాటఁబంచినాఁడు. ఆతనియొద్ద నొక యనుపమమైన చాపమున్నది. దానిని వంచినవారి కాతఁడు తన పుత్రిక నొసంగి పరిణయంబుఁగావించునఁట! వీ రాస్వయం వరమునకుఁ బోవుచున్నారు. నన్నును జనకుఁడు తత్స్వయం వర మహోత్సవంబున కాహ్వానము జేసినాఁడు. కావున నేనచ్చటి కరుగవలయు" నని పలికెను. విశ్వామిత్రుని వాక్యంబులను వినినపిమ్మట రామునకు నాతనివెంట స్వయం

వర మహోత్సవదర్శనార్థమై యేఁగవలయునను నుత్సాహము జనించెను. స్వయంవర సందర్శనార్థమే కాదు. ఆ చాపమును దానెక్కుపెట్టవలెనను తలంపుగలిగెను. కాని యా తలంపు బయటఁబెట్టుటకు సందియమునుగలిగి యూరకుండెను. మునీంద్రుఁ డాతని యుత్సాహమునకుఁ గారణ మెఱుంగఁగోరి యొత్తియడుగ నెట్టకేలకు రాముఁడు " మహాత్మా! ఒక్క చాపమువంచుట కెంతమందిరాజు లేఁగవలెనా?" యనెను. ముని " రఘునందనా! ఆ శివచాపము సామాన్యమైనదని తలంచితివా? ఇప్పుడీ యరుగుచున్న రాజులెవ్వరును దానిని వంచఁజాలరు. ఒకవేళ నీవు దానిని వంచ శక్తుఁడవగుదువేమో" యని నుడివెను. రాముండామాటకుఁ బ్రత్యుత్తరమీయలేదు. లక్ష్మణుండు తన యన్నగారిని మునీంద్రుండు స్వయంవరంబునకుఁ గొనిపోయినచో శివచాప భంగముఁగావించి జానకిని దప్పక పరిణయమాడఁగలుగునని సంబరపడెను. విశ్వామిత్రునకు, దన యంతరంగంబున, నా ధనస్సు రాముఁడుదప్ప వేఱొకరు వంచఁజాలరని తెలిసియుండెను. ఇంతలో " ఏతత్స్వయంవర సందర్శనమునకు మేమును మీ వెంట రావచ్చునా?" యని రాముండు విశ్వామిత్రునడుగ, నందుల కతండు సంతోషముతో నంగీకరించెను.

అటుపిమ్మట, నావిశ్వామిత్రుండు రామలక్ష్మణుల వెంటఁ బెట్టుకొని, మిథిలాపురంబునకుఁ బ్రయాణ మయ్యె. మార్గమధ్యమందు మునిపుంగవుండు నా రాజకుమారుల

కాయా ప్రదేశములం గూర్చి వర్ణించి చెప్ప వారతిసంతోష మున నడచుచుండిరి. ఇట్లు కొంత దవ్వరుగునప్పటికి, శ్రీరాముని పాదంబునకు బాషాణమొకటి తగిలి స్త్రీరూపము ధరించెను. అయ్యదిచూచి రాముఁడు నిశ్చేష్టితుఁడ య్యెను. పాషాణము స్త్రీయాకృతిఁదాల్చుటకుఁ గారణం బెఱుఁగ లేకుండెను. అప్పుడు విశ్వామిత్రుండతని సంశయం బునెఱింగి, "వత్సా, రామచంద్రా! ఈమె గౌతముని భార్య యగు నహల్య. పరమపతివ్రత. ఈమె శాపవశముచేఁ బాషాణమయియుండి నేఁడు నీపాదరజము సోకుటంజేసి క్రమ్మర యోషాత్వముగాంచినది" యని తెలిపెను.

అహల్యయు శ్రీ రామచంద్రుని పాదాంబుజంబు లకు నమస్కరించి, "దేవా! రఘునందనా! నేఁడు నీకరు ణచే నాశాపంబు వాసి పూర్వ దేహంబుఁ బొందితిదానను. నీవు ధర్మసంస్థాపనార్థమై మనుజాకృతిఁ దాల్చిన శ్రీ మన్నా రాయణుండవుగాని సామాన్యుండవు కావు. భవదీయ దివ్య మహిమంబు నుతించుటకు బ్రహ్మ రుద్రాద్యమరులయినను జాలరు. అట్టిచో నల్పజ్ఞాననగు నే నెంతటిదానను. తమ దివ్యపాదారవిందరజము సోకుటంజేసి నాపాతకంబులెల్ల నశించినవి" అని యనేకరీతుల స్తుతించెను. ఆసమయంబు నందచ్చటికి నహల్యాధవుండయిన గౌతముం డరుదెంచెను. ఆతనికి శ్రీరాముండు నమస్కరింప, నతఁ డనేకవిధంబుల దీవించి యతనిచేఁ బూజలనంది యహల్యంగలసి తపోవనం బున కరిగెను. అనంతరము వీరు మిథిలాపురంబున కేగిరి.



# జానకీదేవి.

## మూడవ ప్రకరణము.

### * స్వయంవరము. *

మిథిలాపురాధీశ్వరుండైన జనకుని కూఁతు రయోనిజ. జనకుండు క్రతు భూతలంబును దున్నించునపుడీమె సీత యందు దొరకుటచే సీతా నామముఁ బడసెను. ఈమెను జనకుఁడు పెంచుటంజేసి జానకి యను పేరును గలదు. ఆ భూవల్లభుం డక్కన్నియను దగిన వరున కీయఁదలంచి తన యొద్దనున్న శివచాపంబు నెవ్వఁడు వంచునో యాతని కామె నిచ్చి వివాహము సేయుదు నని చాటఁబంచెను. రూపలావణ్య సంపన్నయగు నా జానకిని వివాహ మాడవలయునని ప్రతి నరపాలునకును నంతరంగంబున నాస జనించెను. అనేక రాజులు స్వయంవరార్థమై యరుదెంచి శివచాపంబును వంచఁ దలంచి తమ భుజబలంబంతయుఁ జూపి, వ్యర్థప్రయత్నులై తమ తమ పురంబులకు మగిడిపోవుచుండిరి. ఎవ్వరు నా చాపమును వంప శక్తులుగాకుంటచే, ‹‹నెవ్వరీ విల్లు వంతురు?

'ఇయ్యది వంచినవారికే నాసుత నొసంగి యుద్వాహంబు గావింతు' నని స్వయంవరంబేల చాటఁబంపితి ?" నని యా జనకుండు విచారింపసాగెను. ఆతఁ డీరీతిని జింతించుచున్న సమయంబున నాతని పురోహితుండగు శతానందుఁడు, "రాజఋషిపుంగవా! దీనికై నీవువిచారింపవలదు. జానకి సామాన్యయువతి కాదు. ఈమెకుఁ దగిన వరుం డరు దెంచు" నని ధైర్యము చెప్పెను.

అంత నొక సేవకుఁ డరుదెంచి జనకునితో "దేవా! విశ్వామిత్ర మహర్షిపుంగవుం డిరువురు రాజకుమారులతో వేంచేసి, తమ రాకఁ దెలుపుమని ద్వారముకడ నిలిచియు న్నాఁ" డని తెలిపెను. ఆ పలుకులు వినఁగనే జనకుండు పురోహిత సమేతంబుగా గాధేయున కెదురేగి నమస్కరించి తోడుకొనివచ్చి, యుచితాసనంబునఁ గూర్చుండఁ బెట్టెను. రామలక్ష్మణులకునుఁ దగిన యాసనంబుల నొసంగి యాద రించెను. మారసమానసుందరులైన రామలక్ష్మణుల ముఖం బులఁ జూచినంతనే వారు రాజకుమారులని యాతనికిఁ దెలిసెను. కాని వారెవ్వరి పుత్రులో యెఱుంగలే కాతని చిత్తంబు తత్తరమందెను. ఆతని తొందర నెఱింగి శతా నందుఁడు విశ్వామిత్రుని విలోకించి, "గాధినందనా! మీ రాకకు మేమెంతయో ముదంబందుచున్నారము. ఈ రాజ కుమారులెవ్వరో యెఱుంగుటకు రాజఋషియగు నీ జనకుండు చిత్తంబునఁ దత్తరమందుచున్నాఁ" డని పలికెను. అప్పుడు విశ్వామిత్రుఁడు జనకునిఁ జూచి, "రాజపుంగవా! వీరు

రామలక్ష్మణు లనువారలు. సాకేతపురాధీశ్వరుండగు దశర
థుని పుత్రులు. వీరు తమ జనకుని పంపున నాయాశ్ర
మంబున కరుదెంచి సవన విఘ్నకారులైన తాటకామారీచ
సుబాహుల నణఁచినారు. త్రోవ నహల్యా శాపంబు వాపి,
నీ గృహంబుననున్న శివకార్ముకంబును జూడ నరుదెంచి
నారు" అని యెఱింగించెను. ఇవ్వాక్యములలో నహల్య
శాపమును వాపెననుమాట వినఁగనే శతానందుని చిత్తం
బపరిమితానందభరితమయ్యెను. అతఁడు తన తల్లియగు
నహల్య శాపము వాయుటకు విశ్వామిత్రుండే కారణంబ
య్యెనని యానందమంది యమ్మునితిలకుం జూచి, "ముని
పుంగవా, విశ్వామిత్రా! నీ ఋణంబు నేనెన్నఁటికిని దీర్పఁ
జాల ననెను. "మా తండ్రియు మా తల్లియు మరల గల
సికొన్నారా?" యని అడిగెను. గౌతముం డహల్యంగూడి
తపోవనంబునకు సంతసంబున నరిగెనని విశ్వామిత్రుండు
చెప్పెను. శతానందుని సంతోషంబునకు మేరలేకుండెను.

జనకుండు రామలక్ష్మణుల రాకకు సంతసించి వారిని
మిగుల నాదరించెను. తన మనంబున, శివచాపమును
రామచంద్రుఁ డెక్కువెట్టినచో బాగుగనుండునని తలంచెను.
రాముండు సాక్షాద్విష్ణ్వంశ సంభూతుండని యాతని చిత్తంబు
నకుఁ దోచెను. వారందఱును గొంతవఱకుఁ గుశల
ప్రశ్నంబులఁ గాలంబు గడపిరి.

మఱునాఁ డుదయంబున, స్వయంవర సభ నేర్పఱిచి
జనకుండు విశ్వామిత్ర సహితులైన రామలక్ష్మణులఁ బిలి

పించి, యర్ఘ్యాసత్కారము లాచరించి యుచితాసనంబు లధిష్ఠింపఁజేసెను. పెక్కండ్రు రాజు లా స్వయంవర భవనమలంకరించి శివచాపంబును వంచుటకు, దమ బాహుబలంబంతయుఁజూపి విగత మనోరథులైరి. జనకుఁడు తన మనంబున నా శరాసనంబును రాముండు వంచినచో జానకినిచ్చి పరిణయమాచరించు భాగ్యము లభించునని తలంచుచు, విశ్వామిత్రునిఁ జూచి, "మానివర్యా! సురాసురులకైనను దీని నెక్కువెట్టఁ దరముగాకున్నది. అయినను, నాయందుఁ గృపవహించి యీ విల్లు రామలక్ష్మణులకు జూపు" మని కోరెను. అప్పుడు విశ్వామిత్రుఁడు రఘురాముని జూచి, "రాఘవా! నేను నీకుఁ గఱపిన యస్త్రవిద్య నేఁడీ సభాముఖంబున గణనకెక్కునట్లు చేయుటకై యీ శివకార్ముకము నెక్కువెట్టుము" అని యాజ్ఞనొసంగెను. అంతట రాముండు గురునియాజ్ఞ ననుసరించి చాపంబును సమీపించి సభాజనులెల్లరును వినుచుండ మేఘగంభీర వచనంబుల, "అస్మజ్జనకుఁడు సత్యవ్రతాచారపారీణుఁడేని, మదీయ హృదయంబు సుజనసేవయందుఁ దగిలియుండునేని, గురుండగు గాధినందనుఁడు నాయందు సదయాంతరంగుఁడై యుండునేని, యీ శరాసనంబును నేను సజ్యంబుఁజేయ శక్తుఁడనగుదుఁగాక!" యని పలికి చాపంబునంది యెక్కువెట్టఁ గడగుతఱి రాజబృందంబెల్ల నాశ్చర్యమందునట్లది విఱిగెను. ఆ ధ్వనికి విశ్వామిత్రుఁడును, రామలక్ష్మణులును జనకుండునుఁ దప్పఁ దక్కినవారెల్ల మూర్ఛనొందిరి.

రాముఁడు శరాసనము భగ్నము సేసినంతనే జనకుండు సంతోషాబ్ధి నోలలాడుచు విశ్వామిత్రునిఁ జూచి "మహాత్మా, గాధినందనా! ఈ రాముని బలము వర్ణనాతీతము. సురాసురులకైన నభేద్యమైన యీ హరశరాసనంబును విఱిచినాఁడు. భవదీయ కరుణావిశేషంబున దశరథ నృపాలుని పుత్రుండగు రామచంద్రుఁడు నా కల్లుఁడగు భాగ్యము లభించినది" యని యమ్మునీంద్రునిఁ బెక్కుభంగుల నుతించి పెండియు, నిజమంత్రుల నవలోకించి, "మీరు సత్వరంబుగ నయోధ్య కరిగి దశరథక్ష్మాపాలుని దర్శించి యీ శుభవార్త వినిపించి యాతనిఁ దోడ్కొనిరండు. ఆతఁడరుదెంచిన వెంటనే జానకీ కళ్యాణమహోత్సవంబు జరుపుదము" అనెను. అందుకు విశ్వామిత్రుఁడును సమ్మతించెను.

శ్రీరాముండు శివచాపంబును వంచినాఁడను శుభవార్త యంతఃపురకాంతాజనంబులకు వినవచ్చి, జానకికిఁ దగిన వరుండు లభించెనని యందఱును ముదమందిరి. సాక్షాల్లక్ష్మీస్వరూపయగు జానకి యీ శుభవార్త విని, విష్ణ్వంశసంభూతుండగు శ్రీరామచంద్ర పదారవింద సందర్శనంబునకై చిత్తంబునఁ దత్తరమందుచుండెను.

అక్కడ జనకుని పంపున నరిగిన మంత్రివర్యులు సాకేతపురంబుఁ జేరి, విశ్వామిత్రునివెంట నరిగిన, కుమారులెప్పుడరుదెంతురో యని నిరీక్షించుచున్న దశరథనృపాలునిఁ జూచి, "భూపాలమౌళీ! నీ తనయుండగు రామచంద్రుండు లక్ష్మణ సహితుఁడై విశ్వామిత్రుని వెంట నరిగి పెక్కండ్ర

రక్కసుల నుక్కడంచి, క్రతురక్షణ మాచరించి, పిదప నమ్మ
నీంద్రుని వెంట జానకీ స్వయంవరోత్సవంబుఁ జూడవచ్చి
సురాసురుల కభేద్యమైన శివశరాసనంబు నవలీల విఱిచెను.
తదీయ శక్త్యతిశయంబునకు జనకుం డద్భుతమంది, తన
తనూజయగు జానకిని రాముని కొసంగి పరిణయముసేయ
నిశ్చయించి, మిమ్ముఁ దోడ్కొనిరండని పంపిన నరుదెంచితి”
మని నివేదించిరి. ఆ శుభవార్త దశరథుండు వినఁగానే
యాతఁడొందిన సంతోషంబునకు మేరలేదు. ఆతఁడు శుభ
వార్తఁ దెచ్చిన మంత్రులఁ బెక్కుభంగుల బహూకరించి
యా వార్త తత్క్షణము కౌశల్యాది కాంతల కెఱుంగఁ
జేసెను. శ్రీరాము వివాహ మహోత్సవంబుఁ బురంబునఁ
జాటఁబంచి యా మఱునాడు వసిష్ఠాదిమునులు వెంటరా,
వివిధమంగళ వాద్యంబులు సెలంగ నా దశరథుం డంతఃపుర
కాంతాజనంబులతోడను, కుమారులతోడను మిథిలాపురం
బునకు బయలుదేరెను.

ఈ వార్త జనకుఁడు విని సంతోషంబునందుచు శతా
నందునితో దశరథున కెదురేఁగి తోడ్కొనిపోయి తగిన
మందిరంబులయందు విడియించినపిదప నొక్కయెడ సుఖా
సీనులై యుండుతఱిని దశరథుని విలోకించి,
“ వసిష్ఠాది మునులతో నరుదెంచినందుల కెంతయు సంత
సించుచున్నాను. నా కులము నేఁడెంతయుఁ బావనంబై
నది. నేను కృతార్థుఁడనైనాఁడను. నలినాప్తవంశశేఖరు
నితో వియ్యమందు భాగ్యము లభించుటంజేసి, నా కీర్తి

వల్లిష దశదిశలం బ్రాకును," అని పలికి వెండియుఁ "పెండ్లి లగ్నంబునుగూర్చి వసిష్ఠాదుల నడిగి వా రేపగిది వ్యాఖ్యానింతురో యట్లు ప్రవర్తింత" మని చెప్పెను. దశరథుం డందుకు సమ్మతించె. అంతట విశ్వామిత్రుఁడు రామలక్ష్మణులం దోడ్కొని దశరథునికడ కరుగ దశరథుం డాతనిఁ జూచి, "యీ మహావిభవంబు నీ కరుణచే లభించిన" దని స్తుతించె. విశ్వామిత్రుండు దశరథునిఁజూచి, "రాజచంద్రా! నీవు సత్యశీలుఁడవు. అతిధార్మికుండవు. నీ నందనుఁడగు రాముని మూలంబున నేను ధన్యుఁడనై నాఁడను. క్రతు సంరక్షణార్థమై నీ యానతిని లక్ష్మణయుతుఁడై నా వెంట నరుదెంచి, యనేక రాక్షసులం దునుమాడి మా మఖంబును గాచి, యహల్యా శాపవిముక్తి గావించినాఁడు. వీరె, సురక్షితులైన నీ సుతులను జూడుము" అని రామలక్ష్మణుల నాతనియెదుట నిలఁబెట్టెను. రామలక్ష్మణు లిరువురును వండ్రికి నమస్కరింప, దశరథుండు వారి నాలింగనము సేసికొనెను.

అమ్మహోత్సవంబునకు జనకుని పంపున మంత్రులరిగి యిక్షుమతీ తీరంబునఁగల సాంకాశ్యమను పురంబున నున్న జనకానుజుడగు కుశధ్వజునిఁ దోడితెచ్చిరి. కుశధ్వజుండు తన పుత్రికలగు మాండవీ శ్రుతకీర్తులఁ గ్రమంబున భరత శత్రుఘ్నులకును, సీయఁదలంచి జనకుని యనుజ్ఞ గైకొని యతని యభీష్టంబును దశరథున కెఱింగింప, నందుకా దశరథుండు సంతోషపూర్వకముగా సమ్మతించెను.

అంతట వసిష్ఠ వామదేవాది మునీంద్రులు శుభలగ్నంబును నిశ్చయింప, నా లగ్నంబున జనకుండు జానకిని శ్రీరామచంద్రునకును, నూర్మిళను లక్ష్మణునకును, కుశధ్వజ పుత్రికలగు మాండవిని శ్రుతకీర్తిని వరుసగా భరత శత్రుఘ్నులకును నొసంగి మహావైభవంబునఁ బరిణయము గావించెను.

పరిణయానంతరంబున జనకుఁడు కూఁతులకుఁ దగిన భూషణంబులు మొదలైనవి యొసంగి, బుద్ధులుసెప్పి, పతివ్రతల కుండవలసిన లక్షణంబుల నన్నిటి బోధించి దశరథుని కప్పగించెను. అనంతరము, దశరథుండు మహావైభవంబున నల్వురు సుతులును, నల్వురు కోడండ్రును, వసిష్ఠాది మునీంద్రులును, వెంటరాఁ జతురంగ బలసమేతంబుగా, సాకేతంబునకుఁ బయలుదేఱెను.

# జానకీదేవి.

## నాలుగవ ప్రకరణము.

### * గర్భభంగము. *

దశరథుండు తన నల్వురు కుమారులతోడను, గోడం డ్రతోడను, బంధు పరివారముతోడను, బయలుదేరి సాయం సమయమగునప్పటి కొక మహారణ్యంబును బ్రవేశించెను. అప్పుడు దశరథుండు తన ముద్దుల కొమరుండైన రాముని జూచి, ''వత్సా, రాఘవా! మనమిప్పుడు మహారణ్యముఁ బ్రవేశించినారము. ఈ రాత్రి మనము ప్రయాణముసేయుట మిగుల కష్టము. ఇది యంతయు రాక్షస సంచార భూమి కావున మనము పరివారముతో నా వటవృక్షంబు క్రింద నీ రాత్రిఁ గడపి తెల్లవాఱుజామున లేచి పురంబునకుఁ బోవుద" మని వచింప రాముండందులకు సమ్మతించి, తమతో వచ్చిన వారి నందఱ నా వటవృక్షము క్రిందకుఁ జేర్ప నందఱును సుఖనిద్రం జెందిరి.

ఇంతలోఁ దెల్లవాఱ వచ్చుచున్నదని సూచించుటకై మలయానిలయంబు డెందంబులకు హాయిగా వీవఁ దొడఁ

గెను. పక్షులు కలకలధ్వనులు సేయుచుఁ దమతమ గూండ్లను విడిచిపోవుచుండెను. ఆ సమయంబునఁ "బోకు, పోకు. నిలు, నిలు" మను కేకలు సింహనాదంబులుంబోలె వారి కర్ణరంధ్రములఁ బడెను. ఆ కేకలు పరశురాముని వని దశరథుండెఱింగి, రామునిఁజూచి "కుమారా, రాఘవా! ప్రళయకాల రుద్రునిపగిది రౌద్రంబునఁబేర్చి పరశురాముండు మనమీఁది కరుదెంచుచున్నాఁడు. ఈతఁడు క్షత్రియ వంశ విధ్వంసకుఁడు. ఇరువదియొక్కమాఱు క్షత్రియుల వధించి, తద్రక్తముతోఁ బితృతర్పణంబులఁ జేసిన మహా శూరశిఖామణి. ఈతఁ డిప్పట్టున మన కేమి హానిసేయునో యని చింతిల్లుచున్నా" ననెను. రాముండు "తండ్రీ! ఏటికీవిచారము? ఆతఁడు భూసురుండుగదా. అకారణముగ మన కాతఁడేమిహాని గూర్చును? ఒకవేళ నాతని కట్టి తలంపే యున్నయెడఁ గరవాలంబును, బాణంబులును నా యొద్ద నున్నవికదా" యని ధీరపురుషోచిత వాక్యంబుల ననుత్తర మిచ్చెను.

ఇంతలో భాలాక్షుని చందంబునఁ గన్నులనుండి యగ్నిజ్వాలలు వెడలఁ జూచుచు, "ఇదం బ్రాహ్మ్యమిదం క్షాత్రం । శాపాదపి శరాదపి" యనుచు, వజ్రాయుధముంబోని పరశువు దక్షిణ భుజంబునఁ గ్రాల, ధవళధవళమగు నొంటిజందెపుఁబోగు వామ భుజంబునఁ దేజరిల్ల, ధరణీదేవకులాబ్ధి సోముఁడైన పరశురాముండచ్చటి కరుదెంచెను. ఆతని భయంకర రూపంబునుజూచి యందఱును భయభ్రాం

తులై మూలమూలల నొదిఁగియుండిరి. దశరథుండాతనికి మ్రొక్కి రాముని చేతను మ్రొక్కించెను. అప్పుడు పరశు రాముండు దండతాడిత భుజంగంబు కరణి మండిపడుచు రాముని విలోకించి, "ఓహో! రామచంద్రా! బాహా సత్వంబున నీవు ఫాలాక్షుని చాపంబు విఱిచినాఁడవన్న వార్త నాకు మహేంద్రగిరియం దుండఁగాఁ దెలియ నీ బలపరా క్రమ శౌర్యంబులఁ గనుఁగొనవచ్చినాఁడ. ఇదిగో, యిటు చూడు, నా చేతనున్న యీ చాపంబును నీవు నంచితివేని నీతో ద్వంద్వరణంబుఁ జేసెద," నని భీకరంబుగఁ బలికెను.

దశరథుండాతని పలుకులకు మిగుల భయంబంది గడగడ వడఁకుచు ముకుళిత కరకమలుఁడై యీ మహా త్ముని విలోకించి, "మహానుభావా, పరశురామా! యజ్ఞసమయంబున భూతలంబెల్లఁ గశ్యపముఖ మహీసురు లకు దానమొసంగిన మహాదాతవు. స్వాధ్యాయపరుఁడవు. మహానిష్ఠంబూని తాపసవృత్తిం జరించుచు విజితేంద్రియుండ వైన సుకృతివి. ఇంద్రుని ప్రార్థన నంగీకరించి, క్షత్రియ హింసమానిన శాంతమూర్తివి. బాలుఁడైన యీ రామ చంద్రునిపైఁ గోపింతువే? ఇక్ష్వాకు వంశంబునకెల్లఁ బ్రాణ మైన నా తనూజుని రక్షింపవే" అని వేఁడెను.

ఈ పలుకుల సతఁడాదరింపక యంతకంతకు మహా రౌద్రంబునఁ బేర్చి, "దశరథా! నీనక్కవినయంబులకు నేను మోసపోవువాఁడనుగాను. మిమ్ము నేమిసేయుదునో యను

భయంబున రాముని చే ముందుగా నాకు మ్రొక్కింతువా? అట్లు చేసినంతమాత్రముననే నేను జాలిదలంతునని యెంచితివా? క్షత్రియ కాంతారంబు నిరువదియొక్కమాఱు ఛేదించి తద్రక్తంబుచేఁ బితృక్రియలఁదీర్చిన యీ భృగురాముఁడీ రాముని గీముని, రాజులను గీజులను, లక్ష్యపెట్టువాఁడుగాఁడు" అని పలికి వెండియు రామునిఁజూచి, "ఓ రామా! నాకు గురుఁడైన మహేశ్వరు దివ్యచాపంబును విఱిచినాఁడవు. మద్గురుచాప భంగముఁజూచి నేను సహింపఁగలనా? నీవు మ్రొక్కినంతమాత్రముననే నేను నిన్ను విడుతునా?" యని గర్జించెను. అప్పుడు రాముండు తండ్రిం జూచి, "తండ్రీ! ఈ వీరశిఖామణికి నేను ప్రత్యుత్తరం బిచ్చెద, నీ వూరకుండు"మని పలికి, పరశురామునిఁ దిలకించి వినయంబు సూచించుచు, "విక్రమోద్దామా, పరశురామా! మునిసుతుండవనియు, బ్రాహ్మణుండవనియు, తపోనిధివనియు, నేను నీ పాదకమలంబులకు మ్రొక్కితినిగాని నీతోఁ రణమొనర్చుటకు భయంబంది మ్రొక్కలేదు. అందుకు నీ వెంతయో యాగ్రహించుచున్నావు. భూసురులు కోపోద్రిక్తహృదయులై యెదిర్చినను నిక్ష్వాకువంశ సంభవులు వారియెడ తొందరపడి శౌర్యంబుఁజూప" రని ప్రత్యుత్తరమిచ్చెను.

ఆ మాటలను బరశురాముండు రామునిఁజూచి, "నీ క్షత్రియత్వమును నా బ్రాహ్మణ్యమును నిప్పుడే యుద్ధంబునఁ జూడఁగలవు. నేను శివునియొద్ద విలువిద్య నభ్య

సించినప్పు డోకసమయంబున నాతోఁ గుమారుండు కయ్యం బునకుఁ దొడరి యోడెను. అప్పుడు మహానుభావుఁడైన రుద్రుండు నన్నెంతయో మెచ్చుకొనెను. మున్ను విధాత రెండు విండులను సృజించి, యందొక్కదానిని త్రిపురా సురులం గెల్చుటకు శంకరునకును, రెండవదానిని విష్ణు నకును నొసంగెను. ఒకనాడు సురలు బ్రహ్మపాలి కరిగి రెండు చాపములలో నేదియెక్కుడో యరయఁదలంచి తుదకు హరివింటిబలం బెక్కుడని యెఱింగిరి. శివుఁడు తన వింటిని దేవరాతున కిచ్చెను. అన్వయపరిపాటిం జేసి యది జనకు నకు వచ్చెను. హరునిచే ననేక సంగరంబులఁజేసి విడువ బడినఁ చిరకాల జీర్ణచాపంబును నీవు విఱిచితివి. ఇదిగో, చూడు! ఇయ్యది విష్ణుచాపము. అప్రతిమానసారమగు నీ చాపమును విష్ణుండు ఋచికున కొసంగెను. ఆతఁడు జమదగ్నికిచ్చెను. జమదగ్ని నా కొసంగెను. ఈ విష్ణు చాపమును నీవు వంపుము. అట్లు సేయవైతివేని నిన్నొక యుద్ధమునకు నవతలకుఁ బోనీయను" అని నుడివెను.

అప్పలుకులకు రామచంద్రుఁ డాగ్రహంబంది, పరశు రాముని హస్తంబుననున్న చాపంబును గైకొని, భుజసత్వ మేర్పడ వంచెను. రాముండది వంచుచుండఁ బరశురా ముండు పరాక్రమదర్పంబులుడిగి మహాద్భుతమంది శ్రీరా ము నవలోకించి, "సుగుణాభిరామా, శ్రీరామా! నా విల్లు నీవు చేఁబూనినప్పుడ నీవు చతుర్భుజుఁడవన్న విషయము తెలిసె. ధరాభారము వాప శ్రీరామనామంబున నీ

యిక్ష్వాకు వంశంబున జన్మించిన శ్రీహరివి కాని సామాన్య మానవుండవుగావు. కాకున్న నితరులకీ మహాశక్తి యుండునా? జగత్త్రయ కర్తయైన విష్ణుండవు నీవగుటచే నీ విజయంబు నాకుఁ బరాభవముగాదు. నీవును నేనును వైష్ణవాంశసంభూతులమే" యని పలికి వెండియు, "రామా! సకల ధరాతలంబును గశ్యపునకు దానమిచ్చినప్పుడు రాత్రులయందుఁ బుడమి నుండనని చెప్పినాఁడ. కావున రాత్రులయం దిచ్చట నుండరాదు. మహేంద్రగిరి కరిగెద" నని యతనిచే ననుజ్ఞాతుఁడై యరిగెను.

అనంతరము దశరథుండు కుమారుని పరాక్రమంబునకు మిగుల సంతసమంది, యతనిని కౌఁగిలించుకొని, పరివారసమేతుఁడై యచ్చోటువాసి, సాకేతంబును బ్రవేశించెను.

# జానకీదేవి.

## ఐదవ ప్రకరణము.

### * అసూయ. *

నల్వురు కుమారులును నిరంతరంబును భక్తిమై సేవింప, ధర్మమార్గము దప్పకుండ దశరథుండు నిజరాజ్యంబగు కోసలదేశముం బాలింపుచుండెను. ఇట్లు కొన్నాళ్ళు పరిపాలించి జ్యేష్ఠసుతుండగు శ్రీరామునకు రాజ్యభార మప్పగించి తాను పరమేశ్వరధ్యానంబున జీవితశేషంబు వెళ్ళఁబుచ్చఁదలంచెను. రాష్ట్రజనంబు లెల్లరును శ్రీరాముని రాజుగాఁజేయుటకుఁ దమ యభిప్రాయమును దశరథునితో వెల్లడించిరి. అంతట నొక్కదినంబున దశరథుండు తన కోరికను వసిష్ఠాది మహామునులకుం దెలిపి, శ్రీరామునిఁ బిలిపించి యక్కుమారు నవలోకించి, ,, వత్సా, రాఘవా! నే ననేకవ్రతంబులును, దానంబులును, యాగంబులునుఁ గావించి, నల్వురు పుత్రులను గంటిని. అందు నీవగ్రజుండవు. లోకోద్ధారకుఁడవు. నీవు శూరుండవు. ధీరుండవు. కావున నీ విశ్వంభరాభారంబెల్లను నీ భుజస్కంధమునందుఁ

బెట్టెదను." అని పలికి వెండియు, "ఎల్లుండి పట్టాభిషేక మహోత్సవంబు జరుపఁబడును. కావున, నీవు ధరాసుతా సహితుఁడవై పుణ్యోపవాసంబుననుండు" మని పలికి వీడ్కొలిపెను. అంత రాముండు తన నగరి కరిగి యథోచితాచారంబున నియతుండై యుండె.

శ్రీరామచంద్ర పట్టాభిషేకంబుకొఱకుఁ బురంబెల్ల ననేక చిత్రగతుల నలంకరింపఁబడెను. పురజనులెల్లఁ దమ గృహంబులను దోరణంబులచే నలంకరించి, యభిషేక మహోత్సవదినం బెప్పుడరుదెంచునా యని యత్యుత్సాహ పూరితులై యుండిరి. ఎచ్చటఁ జూచినను వివిధమంగళ వాద్యంబులు సెలంగుచుండెను.

ఇట్టిసమయంబున రామపట్టాభిషేక మహోత్సవం బునకు భంగముకలిగింపఁదలచి, దశరథుని తృతీయభార్యకుఁ గడుఁ బ్రియంబుఁగూర్చు దాసియగు మంథర కైకపాలికిం జని, "అమ్మా! నీభర్త నీకెప్పుడును బ్రియంబుఁగూర్చు చుండునని గర్వించుచుందువు. ఆ పలుకులు నేఁడు మిథ్య యయ్యెను. కౌసల్యపైఁ బ్రేమఁజూపుట కామె సుతుండైన శ్రీరాముని రేపు నిఖిలోర్వీచక్రంబునకు రాజుగాఁ జేయఁబోవుచున్నాఁ" డని చెప్పెను. ఈ మాట వినినంతనే కైక కడు సంతసపడి "మంథరా! నేఁడు నాకు మిగుల సంతోషకరంబైన వార్తనుఁ జెప్పిన దాన," వని పలికి దాని కొక పచ్చలహారంబు నొసంగెను. హృదయంబున నరితకుఁ

బూర్వ మేవిధమైన యసూయయు నెఱుంగని యా కైక మానసంబును జలింపఁజేయఁదలంచి మంథర యామెను విలోకించి, " అమ్మా! ఈ వార్త నీకు సంతోషకరంబుగ నున్నదేమో కాని నాకుమాత్ర మట్లులేదు. నిజముగా నీ విభుండు నీ యందుఁ బ్రేమగలవాఁడేని నీ సుతుండైన భరతునకే మహీతలమిచ్చియుండును. ఈ మాటలతో నేమిపని యున్నది. నీవు తలంచునట్లు నీ యందె నిజముగా రాజునకుఁ బ్రేమకలదందువేని భరతునకుఁ బట్టంబుఁగట్టునట్లు జేయు" మనెను. కైక దానింజూచి, " మంథరా! నీ వచనంబులు నాకు మిగుల నాశ్చర్యమును గలుగఁజేయుచున్నవి. పుత్రుల యందు శ్రీరాముండు జ్యేష్ఠుఁడు. గుణవంతుఁడు, ధీరుఁడు, ఉదారుఁడు, మహావీరుఁడు. అట్లగుటం జేసి, రాజాతనిని భూపతిగాఁ జేయ నెంచినాఁడు. ఇందు ధర్మవిరుద్ధ మేమియు లేదు. అదియుంగాక ప్రజలెల్లరును శ్రీరాముని రాజుఁ జేయుటయందు సంతోషపూర్వకమగు తమ ప్రీతిని దెలియఁ జేసినారు. ఇప్పుడు నేను నీవు వచించిన తెఱంగున భరతుని రాజుగాఁ జేయుమని భూవల్లభునిఁ బ్రార్థింతునేని, కైక యోర్వలేక యిట్టి యకార్యముఁ జేయసాహసించెనని జనంబులు నన్ను నిందింపరా" యని వచించె. ఆమె హృదయంబు నెట్లయినఁ ద్రిప్పుటకు దీక్షవహించిన యా మంథర మరల నామెను విలోకించి, " దేవీ, నా పలుకు వాక్యంబులు నీ కాగ్రహము గలిగించినచో నేమియుఁ జెప్పఁజాలను. నా చేతులారఁ బెంచిన భరతయ్యకు రాజ్యములేమిఁ జూచి

నేను సహింపఁగలనా ? రాముఁడు రాజయ్యెనేని కౌసల్య తనకు నీ యందున్న యాగ్రహాము సాధించితీరును. భరతుండు శ్రీరామునకును, నీవు కౌసల్యకును సేవసేయుట తప్పదు. ఇన్నిదినంబులనుండియు, దశరథునకుఁ బ్రియంబుఁ గూర్చు కాంతవై యుండి యిప్పుడు కౌసల్యకు సేవఁజేయ నెంచినావా ? ఇది నేను గన్నులారఁ జూడఁగలుగుదునా ? దేవీ ! ఇంకఁ బలుమాటలతో నేమిపనియున్నది ? భరతునకుఁ బట్టంబుఁ గట్టుమని నీ భర్తను గోరుము" అని తన దృఢాభిప్రాయమును వెల్లడించెను. మంథరవాక్యము లామె హృదయంబునకు నాటెను. భరతుని రాజుఁజేయుమని నిజ కాంతునిఁ గోరుట కామెకుఁ గోరిక జనించెను. మంథరను జూచి, "మంథరా ! నీవు చెప్పిన వాక్యములు నా హృదయంబునకు నిజమగునట్లు దోఁచుచున్నది. రాముఁడు రాజయ్యెనేని కౌసల్యకు నేను సేవఁజేయుట తప్పదు. కావున నిందు కేదయిన దారిఁజెప్పి నన్ను రక్షింపు" మనెను. అప్పుడు మంథర "అమ్మా ! యుపాయంబునకై యాలోచింపనేల ? మున్ను జయంతపురంబున శంబరునకును దేవేంద్రునకును గయ్యంబు జరిగినప్పుడు నీ నాథుండు దేవేంద్రునకును సాయముసేయ నరిగెను. అప్పుడు నీవును వెంట నరిగి రాక్షసుండొనర్చు మాయలకుఁ బ్రతీకారముసేయ నీ పతి మెచ్చి నీకు రెండువరంబు లిచ్చెను. అవి యిప్పటికి వచ్చును. ఇప్పుడు నీ నాథుని భరతునకుఁ బట్టంబుఁ గట్టుమనియు, రామునిఁ బదునాల్గు వత్సరంబు

లరణ్యవాసముసేయఁ బంపుమనియు నీ రెండువరంబులును గోరుము. నీయందున్న ప్రేమచే నాతఁడు తప్పక నిన్ననుగ్రహించు" నని బోధించెను. కైక యా మంథర దుర్బోధనకు లోఁబడెను.

అనంతరము కైక తన నాథుండు తన మందిరంబున కరుదెంచెడువేళ నెఱింగి, మాసిన వలువఁదాల్చి, భూషణంబులఁ దీసివేసి యొకమూలఁ బడియుండెను. అంతఁ గొంతసేపటికి దశరథుండరుదెంచి, నలుప్రక్కలను నారసి, కోపగృహంబున కైకం జూచి యామె యునికికి మిగులఁ బరితాపమంది సమీపించి, "అక్కటా! కేకయ రాజపుత్రీ! ఇట్టులుండుటకు నేమి కారణము? ఎవ్వరు నీ కిగ్గు సలిపిరి? నీ కహితవాక్యంబుల నెవ్వరైన నాడిరా? అడిగినచోఁ బ్రాణమైన నర్పించుటకు సంసిద్ధుఁడనై యున్న నేనుండఁగా ని కిట్టిచింత యేల కలుగవలెను?" అని పలికెను. అందు కామె యేమియుఁ బ్రత్యుత్తరంబు నొసంగక నిట్టూర్పులు నిగుడ్చుచు నాతనికి మఱింత సంతాపము హెచ్చుచేయుచుండెను. దశరథుండామెంజూచి, "తరుణీ! ఎంత పిలిచినను బలుకవేల? నాయెడ నీ వాల్గంటిచూపులఁ బ్రసరింపఁజేయుము. నీ యాగ్రహంబునకు నేను దాళఁగలనా? ఒక్క నిముసము జాగుచేసి వచ్చితినని కోపమువచ్చినదా? క్షమింపుము. రామపట్టాభిషేకమహోత్సవ విషయమున వసిష్ఠాది పురోహితులతో సంభాషించుటయం దించుక తడవైనది. కౌసల్యాసుమిత్రలకన్న నీయందెక్కుడు ప్రేమఁ

బూని వర్తించువాఁడనని నీకుఁ దెలిసియుండియు నీ రీతి గోపముఁబూనిన నే నేమని వచింపఁగలను! సుకుమారమైన శరీరంబు నిట్టి యునికిచే గాసిల్లఁజేయుట తగదు. లెమ్ము" అని పరిపరివిధముల మోహపాశనిబద్ధుఁడై ప్రతిమాలుకొనెను. కొంతసేపటి కామె మునుంగుఁదీసి కోపారుణిత నేత్రయై చూచెను. అప్పుడు వారిరువురకును నీ క్రింది విధమున సంభాషణ జరిగెను.

కైక :— ప్రాణేశ్వరా! ఇంతవఱకును మీరు నిరంతర సత్య వ్రతాచార పారీణులని తలంచితినిగాని యిట్టివారని యెన్నఁడును నెఱుంగనైతిని. మీ మానసంబు కల్లలకుఁ గపటంబులకు జన్మస్థానమని నేఁడు తెలిసినది. ఆహా! యెంతటివారు! మీరిక్కడ నుందురను మాటయేకాని పొంది యిక్కడనుండును. పంచప్రాణంబులును గౌస ల్యపై నుండును. అయయో! ఇక్కడకు వచ్చుటకు మిగుల నలసినారు. కౌసల్య మీ రాకకై వేచియుం డును. హా! త్వరగా నేఁగుఁడు.

దశ :— రమణీ! ఎట్టి దారుణవాక్యంబులచే నా హృదయం బును భేదించుచున్నావు! ఇట్లు నన్నుఁగూర్చి పలుకుట ధర్మమని తోఁచెనా? కౌసల్యయందు ప్రేమ యధి కమో, నీ యందే యధికమో నీకుఁ దెలియదా? అన వలసి యనుచున్నావు. అది యటులుండ నన్ను సత్యశీలుఁ

డని పలికితివి. రఘువంశ ప్రభూతులెప్పుడు నసత్యంబు నకు మానసంబునఁ జోటియ్యరుసుమా!

కైక :— ఎన్నియైననుఁ జెప్పవచ్చును గాని చేయుటకష్టము. మీ హృదయము సకపటమని నేఁడు తెలిసినది.

దశ :— తరుణీ! నే నెప్పుడైన నసత్యమాడియున్నానా?

కైక :— మున్ను శంబరాసుర యుద్ధంబున మీరు నాకిచ్చె దమన్న వరద్వయంబు నొసంగియున్నారా?

దశ :— ఇయ్యనని నే నెప్పుడైనను జెప్పియున్నానా?

కైక :— అట్లయిన నా వరంబుల నిప్పుడొసంగెదరా?

దశ :— తప్పక యొసంగెదను. కోరుకొనుము.

కైక :— సంపూర్ణముగ నాలోచించిన పిమ్మట మాట యొసం గుఁడు. తరువాతఁ జింతించినచో లాభ ముండదు.

దశ :— ప్రాణేశ్వరీ! నే నెప్పుడు నసత్యమాడువాఁడనుగాను. ఏల? ఈ రీతి డెందంబున సందియమందెదవు!

కైక :— సరే, నా కొసంగెదమన్న వరంబుల నిచ్చుటకు సంసిద్ధులై యున్నారా?

దశ :— ఏమియు సంశయము లేదు.

వీరిరువు నీ రీతి సంభాషించునప్పుడు కోపస్వభావ యగు కైక యుట్టి దారుణపు గోరికఁ గోరునోయని దశర

థుఁడు తన మనంబునఁ దలంచెను; కౌసల్యాదులచేత నూడిగము సేయింపుమనునో, సుజనావళిని దండింపుమనునో, యని విచారింపసాగెను. ఎట్టిదారుణమైన వరంబులఁగోరినను, నీయక తప్పదని నిశ్చయము చేసికొనియుండెను. అంతటఁ గైక, దశరథు నవలోకించి, ‘‘ మనోవల్లభా ! వరంబులను దప్పక యొసంగుదునని పలుకుటచేఁ గోరుచున్నాను. నిఖిలోర్వీభాగంబునకును భరతుని రాజుగాఁ జేయుట మొదటివరంబు. రాముని నరణ్యంబునఁ బదునాల్గు వత్సరంబులు వసింపఁబంపుట రెండవ వరంబు. సత్యసంధత కలవారేని యీ రెండు వరంబులను దయచేసి మీ సత్యవ్రతదీక్షను గాపాడుకొనుఁడు ’’ అని తన కోరికలను వెల్లడించెను.

అతిదారుణమైన కైక వాక్యములు, దశరథుని హృదయంబున శూలంబులవలె నాటెను. జగంబంతయు నంధకారంబున మునింగినట్లాతనికిఁ గన్పట్టెను. భరతుని రాజుగాఁ జేయుమనియు, రాముని నరణ్యంబులకుఁ బంపుమనియుఁ, గైక కోరఁగనే, దశరథుండు మొదలునరికిన కదళీతరువు కరణి మూర్ఛిల్లి, కొంతవడికి లేచి, యక్కైకను విలోకించి, ‘‘ అక్కటా ! నారీ, భరతునికంటె నీ యందెక్కుడు భక్తిఁ బూని చరించువాఁడు, యెవ్వనికినిఁ గీడుచేసి యెఱుంగని వాఁడు, సర్వజనవంద్యుఁడు, అట్టి నా యగ్రసుతుండైన శ్రీరాముఁడు నీ కేమి కీడు సల్పినాఁడు? నీ వాతనికిఁ గీడు దలపెట్టినావేల? రాజ్యంబునైనను ప్రాణంబులనైనను విడు

తునుగాని శ్రీరామునిమాత్రము విడువఁజాలను. ఆతనిఁ బాసినచోఁ ద్రుటికాలమైనను నేను ప్రాణంబులతో నిలువఁ జాల" నని పలికెను.

కైక, "భూవల్లభా! నీవు చింతింప నవసరములేదు. ఇట్లందువనియే కదా ముందుగా నాలోచించుకొని మాట యొసంగుమని చెప్పియుంటిని. ఇక్ష్వాకువంశసంభవు లెవ్వ రును, నాడితప్పరు. కౌసల్యను జూచి యామెకు భయం బంది కులధర్మంబును బరిత్యజించితివి. పోనిమ్ము. ఇది యంతయునేల? వరంబు లొసఁగెద ననలేదనుము. నేను ప్రాణంబులఁ ద్యజించెదను. పిదప మీరు భరతునిఁ జంపి శ్రీరామునకుఁ బట్టంబుగట్టి కౌసల్య కానందమును గూర్చి సుఖింపుఁడు" అని కోపమున సక్రోశించెను. దశరథుం డామెను జూచి, "అయ్యయ్యో! నే నసత్యంబునకుఁ బాల్ప డుదునా? ఎంతమాట యంటివి! రమణీ, నా యందుఁ గృపాన్వితచిత్తవై నా విన్నప మాలకింపుము. వలయునేని భరతునకు నిఖిల సామ్రాజ్యంబును గట్టిపెట్టెద. రాముని బాసి ప్రాణంబుల భరింపఁజాల. రాముని దయఁజూడు" మని బ్రతిమాల, నామె ప్రసన్నురాలు గాదయ్యెను. చింతతోఁగూడిన గోపమునుబూని దశరథుఁడు "ఓసీ! మహాసద్గుణాఢ్యుఁడైన కేకయరాజు గర్భమునఁ జనించిన దానవని తలంచి నిన్ను వివాహమాడితిని గాని నాకుఁ దల గడ క్రింది త్రాఁచవగుదువని యెన్నఁడును దలపోయలేదు. రఘువంశమును ధ్వంసంబు గావించెడిదాన వని యెఱుంగక

పెండ్లియాడితి" నని పలికి, వెండియు రాముని దలంచుకొని, "అయ్యో! రాఘవా! నిన్నరణ్యంబులకుఁ బొమ్మని యెట్లు పలుకుదునోయి, తండ్రీ! నిన్నెడఁబాసి నేను జీవింపఁ గలనా?" యని మూర్ఛనొందెను.

అంతఁ దెల్లవాఱి, రాముండు తానుం జానకియు నూతనాంబరములఁ ధరించి యభిషేక మండపమున లగ్నంబున కెదురు సూచుచుండెను. వసిష్ఠుండు సకల మునిజనంబులతోడను నభిషేక మండపంబున కేతెంచెను. అరుంధతి మొదలగు పుణ్యయోషిజ్జనంబులు వచ్చిరి. నానాదేశనృపాలురతో భవనము నిండియుండెను. అప్పుడు వసిష్ఠుఁడు సుమంత్రునిఁబిలిచి, సామ్రాజ్యాభిషేక శుభలగ్నంబు సమీపించినది కావున దశరథునిఁ దోడ్కొనిరమ్మని నియోగించెను. సుమంత్రుండు కైక మందిరంబును బ్రవేశించి, దూరంబున నిలుచుండి, "మహారాజా! అభిషేకసమయ మాసన్నమగుటచే వసిష్ఠుండు దేవరను దోడ్కొనిరమ్మని నన్నుఁ బుత్తెంచినాఁ" డని విన్నవించెను. ఆ మాటకుఁ బ్రత్యుత్తరమేమియు రాలేదు. మూర్ఛనందియున్న రాజును సుమంత్రుఁడు తిలకించి నిద్రను మునింగియున్నవాఁడని తలంచెను. అప్పుడు కైక సుమంత్రునిఁ జూచి, "ఓయీ, సుమంత్రా! శ్రీరాముని మహారాజుగారు చూడఁదలంచుచున్నారు. కావున వారి యాజ్ఞగాఁ దెలిపి యాతని నిచ్చోటికిఁ దోడ్కొనిరమ్ము" అని వచించెను. సుమంత్రుండు కడురయంబున నరిగి యీ మాట శ్రీరామునకుఁ దెలిపెను.

శ్రీరాముండు మహాభాగ్యమని సంతసించి సీతాలక్ష్మణ యుతుండై రథంబెక్కి మార్గమధ్యంబున బుణ్యాంగనలు రత్నదీపకళికాళి నివాళులీయ నరిగి కేకయరాజపుత్రి మందిర ద్వారంబున రథంబు డిగ్గి లోనం బ్రవేశించి, మూర్ఛిల్లి యుండిన తండ్రింజూచి భీతుండై, కైకకు నమస్కరించి యామెను విలోకించి, "తల్లీ! జనకుండిట్లు మూర్ఛనంది యుండుటకుం గారణమేమి? జనకాజ్ఞోల్లంఘన మెప్పుడునుం జేసియుండనుగదా" యని పలుక నక్కైక, "రామచంద్రా! కారణము జెప్పుటకు నాకును విచారకరముగనేయున్నది. పితృవాక్య పరిపాలకుండవగుటచేం జెప్పెదను. మున్ను మీ తండ్రి దేవాసుర యుద్ధంబున నాకొసంగిన వరద్వయంబును నిప్పుడొసంగుమని కోరితిని. మీ తండ్రి సమ్మతించె. భరతునకుం బట్టము గట్టుమనియు, నిన్ను వనంబులం బదు నాల్గు వత్సరంబులు వసింపం బంపుమనియు నీ రెండువరంబులును గోరినాను. నీవు తండ్రి సత్యంబుగాపాడెడు పుత్రుండ వేని తాపసవృత్తింబూని యరణ్యంబుల కరుగుము" అని చెప్పెను.

ఆమె వాక్యంబులకు రాముండించుకంతయుం జింతిం పలేదు. మునుపటికంటె నాతని ముఖబింబంబు మఱింత ప్రకాశమానమై యొప్పెను. అప్పుడాతండు కైకనుజూచి "తల్లీ! నీయాజ్ఞల మన్నించుటయుం తండ్రిగారి సత్యంబుం గాపాడుటయు, నాకు విధియైయున్నది. నీ వావంతయు డెందంబున నా విషయమున సందియంబందవలదు. అర

ణ్యంబునఁగల తాపసులకు సేవఁజేయు భాగ్యము నీ కారుణ్యంబున లభింపనున్నందుకు సంతసించుచున్నాను. నీవు కోరినయట్లు భరతునకు రాజ్యంబు నొసంగనిమ్ము. నే నరణ్యంబుల కరిగెద" నని సంతోషముతోఁ బలికెను. కైకయాతని పితృభక్తికి సంతసించెను.



# జానకీదేవి.

## ఆఱవ ప్రకరణము.

* పితృభక్తి - పతిభక్తి - భాతృప్రేమ. *

శ్రీరాముండు తండ్రి సత్యంబుఁ గాపాడుటకు వనంబుల కరుగుటకు సమ్మతించెనని సీత తెలిసికొనెను. ఆతనిం బాసి యామెయొక్క త్రుటికాలమైనను నుండుట కిష్టము లేనిదై యుండెను. వివాహమైనది మొదలు రాముని నొక్క నిమిషమైనను బాయక నిరంతరము నాతని పాదసేవఁ జేయుచు, నాతఁడే దైవమని భావించుచుఁ దన సద్గుణంబుల నుదాహరణంబుగాఁ జూపుచు, ప్రపంచంబునఁగల కాంతల కెల్ల దలకట్టయి యొప్పుచుండెను. రాముండు వనవాసంబునకు సమ్మతించెనని యెఱింగి, యతనిం జూచి ముకుళితకరకమలయై గద్గదకంఠంబున "మనోహరా! నీవు వనవాసంబునకు సమ్మతించినాడవు. నేనును నీ వెంట నరుదెంచెద. నిన్నుఁ బాసి యొక్క త్రుటికాలమైనను జీవంబుల భరింపఁ జాల. నీవు వెలిమైన భోగంబు లేవియు నే నొల్ల" నని పలుక, రాముం డక్కాంతాతిలకంబును జూచి "తరుణీ, నేనును నీ వియోగంబును సహింపఁజాలను. అయినను

తండ్రి సత్యంబుఁ గాపాడుట నాకు విధియై యున్నది. ఇయ్యది నాకు సత్య శాసనంబని యెఱుంగుము. నీ వెప్పుడును గానన భూముల నెఱింగినదానవు కావు. అరణ్యంబులనునవి క్రూరమృగంబులతోడను, దుర్గమంబులైన కంటక పథంబులతోడను, మాయావులగు దానవులతోడను, నిండి యుండును. నీ వత్యంత సుకుమారాంగివి. వనవాసం బతి కాయాసకరంబు. ఎండ కెండుచు, వానకుఁ దడియుచుఁ, బర్ణశాలయందు వసించుచుఁ, గుశతల్పంబులయందు శయనించుచుఁ, గందమూలంబులఁ దినుచుఁ గాలంబుఁ గడప వలయును. నీవీ కష్టంబులకుఁ దాళఁజాలవు. కావున నిచ్చట నుండుము, నేను పదునాల్గు వర్షములును బదునాల్గు దినములుగాఁ గడపివచ్చెద" నని నచ్చఁజెప్పెను.

సీత యందుకు సమ్మతింపలేదు. ఆమె నిజనాథు నవలోకించి, "ప్రాణేశ్వరా! నన్ను నీ కొసంగి మజ్జనకుం డెంతయో సంతసించుచున్నాఁడు. అగ్నిసాక్షిగ గైకొనిన సహధర్మచారిణినైన నన్ను విడనాడియుండుటకు నీ చిత్తం బెట్లు సమ్మతించినది. నీవు నా యండనుండగా దనుజ మృగోరగ భయంబులు నన్నుఁ జెందవు. అరణ్యమున నీతో నేఁబడు కష్టంబులన్నియు నాకు సౌఖ్యములుగనే యుండును. కావున నన్ను నీ వెంటఁ గొనిపొమ్ము. అట్లు గాదేని నీ పాదసన్నిధిని ప్రాణంబులఁబాసి సుఖించెద" నని తన నిశ్చయంబు వెల్లడించెను. రాముం డామె కేమియుఁ బ్రత్యుత్తరమీయఁజాలక యామె ప్రయాణంబునకు సమ్మతించెను.

ఇది యంతయుఁ బ్రక్కనుండి చూచుచున్న లక్ష్మణుండు కోపావేశపరవశుండై యగ్రజుని నవలోకించి "అన్నయ్యా! అశక్తునివిధంబున నీ రీతిఁ బలుకుచున్నావేల? నీ సామర్థ్యము నీ వెఱుంగ లేకున్నావు. ఈ తండ్రి మహాధర్మపరుండని తలంచుచున్నావు కాఁబోలు. ఈతఁడు తన ప్రియకాంతయైన కైకమాటలు విని యింత తెంపున కొడంబడినాఁడు. మోహ మీతని కన్నుల గప్పివేసినది. నిన్న సభాజనంబులెల్ల వినుచుండ నిన్ను రాజుఁ జేసెదనని పలుక లేదా? ఈతడు కైకకిచ్చిన వరంబుల వృత్తాంత మెవ్వరెఱుంగుదురు? మహాసభాస్థలంబునఁ బలికిన వాక్యంబుల దప్పవచ్చునా? ఆహా! వలలఁజిక్కి పలికినది జరపవలెనట! వసిష్ఠాది మునులు వినుచుండఁ బలికినది తప్పవచ్చునఁట! ఇందు కేమందును? జనకుండు నీతిజ్ఞుఁడై యెట్టిపనిఁ జెప్పినను గుమారులు సేయవలయుగాని యన్యథావర్తించినచోఁ గుమారులందుకుఁ బ్రతివిధానము సేయవచ్చును. నీవు నాయెడ నలిగెదవేమోయని భీతినందుచున్నానుగాని లేనిచో నీ కయికను గయికను మదీయ కరవాలంబున కెఱసేయకుందునా? అగ్రజా! వేయేల? ఆజ్ఞనిమ్ము. మదీయ ఖడ్గాగ్నిచే యుష్మదభిషేక ప్రతికూలురై యున్న వారినెల్ల భస్మంబుగావించి సామ్రాజ్యంబెల్ల నీకొసంగెద" నని యొఱనుండి ఖడ్గంబు నూడఁబెఱికి, నలుదెసలం గోపావేశపరవశుండై చూచెను. అప్పుడు రాముండు సౌమిత్రింజూచి, "లక్ష్మణా! నీవు నాకుఁ గడుఁగూర్చు తమ్ముండవవి యెఱుఁ

గుదును. నీ కశక్యమైన కార్యంబీ చతుర్దశ భువనంబుల యందునులేదు. స్వమతాచార గౌరవంబులఁ గాపాడుకొనఁ దలంపుము. నేను పితృవాక్యంబుఁ జెల్లింపఁ దలంచినాడ. నా పూనిక నెఱవేర్పఁజూచుట నీకును విహితమైన కృత్యమే. అది యట్లుండ దశరథ నృపాలుండు నీకుఁ దండ్రియగును. కేకయ మహీపాలపుత్రి తల్లి. భరతుండగ్రజుఁడు. వీరిలోఁ బరులెవ్వరు ? ఎవ్వరపై నీవీ వీరోక్తులాడెదవు ? వత్సా ! శాంతింపుము. ఈ సకల మహీచక్రంబునకును భరతుండు రాజగును. కావున నీవాతని యొద్దనుండి ధర్మపరుఁడవై యాతనిచే రాజ్యమేలింపుము " అని నుడువ, లక్ష్మణుం డగ్రజుని విలోకించి, " అగ్రజా, రామచంద్రా! ఇక్కడ భోగంబులు నా కేమియు నిష్టంబులుగావు. జటావల్కలముల ధరించి నీ పాదసేవఁజేయుచు నరుదెంచెద. వలదన్నచోఁ బ్రాణంబులు విడిచెద " నని పలుక, రాముండు లక్ష్మణుఁడు తనతో వచ్చుటకు సమ్మతించెను.

మూర్ఛ మునింగియున్న దశరథుండు జానకీ రామ లక్ష్మణుల ప్రయాణంబు నెఱింగి, శోకజనిత పరితాప దందహ్యమానహృదయుండై సమీపంబుననున్న సుమంత్రునిఁ జూచి, " సుమంత్రా ! నాకుఁ గులవిస్తారకుండైన శ్రీరామచంద్రుండు జానకివెంటరా లక్ష్మణయుతుండై కృపాగచిత్తమైన నైక కారణంబున నరణ్యంబుల కరుగుచున్నవాఁడు. కావున నీవు సకల రాజ్యసంపదలతోడను బుధజనంబులతోడను నాతనివెంట నరుగుము. శూన్యమైన పురంబునకీ

కైక భరతుని రాజుగాఁ జేయు," మని పలికెను. ఈ వాక్యంబులు విని కైక కోపించి, "అట్లు వలనుపడదు. వీరు ముువ్వురును నారచీరలు ధరించి యరణ్యంబుల కరుగవలయును. అట్లు గాదేని వరంబుల నొల్ల," నని పలుక, దశరథుండా వాక్యంబుల విని మరల మూర్ఛనొందెను.

రాముండు కైకంజూచి, "తల్లీ! నా కీతండు తండ్రియు, గురుండును, రాజునునై పరఁగుచున్నాఁడు. ఈతని యాజ్ఞను నేను గరళంబైనను భుజించెదను. సాగరంబునైనను, గార్చిచ్చునైనను జొచ్చెదను. నాకు నసాధ్యమైన కార్య మీ త్రిభువనంబులయందును లేదు. కావున వల్కలంబులఁ దెప్పింపుము. మే మవి ధరించి చనెద," మని నుడువ, నామె నారచీరలఁ దెప్పించి వారిముందు పెట్టించెను. అంతట రాముండు జటాభారము బూని, కర్కశవల్కలములుగట్టి, విభూతి మేనినిండ నలఁది యక్షమాలికలుదాల్చి మునివేషధారియై యుండె. సౌమిత్రియు, జానకియుఁ దాపస వేషంబులఁ గైకొనిరి. అప్పుడు రాముండు మూర్ఛమునింగి యున్న తండ్రి నవలోకించి, "తండ్రీ! పదునాల్గు వత్సరంబులును బదునాల్గు దినంబులుగాఁ బుచ్చి వచ్చెదము. దీనికై నీవింత విచారించెదవేల? భరతుండు నాకంటె నీకుఁ బరమభక్తుఁడు. నీ కాజ్ఞానువర్తియై మెలంగు," నని పలికి యాతనికిని, కైకకునుఁ బ్రొమొక్కి, దోయిడలు మఱచి యున్న తండ్రిని విడిచి, సీతాలక్ష్మణులు వెంటరా, తల్లియగు కౌసల్య మందిరంబున కరిగెను.



# జానకీదేవి.

## ఏడవ ప్రకరణము.

### * వనగమనము. *

కౌసల్యాదేవి శ్రీరామ పట్టాభిషేకంబునకు భంగము గలుగకుండ సమస్త దేవతాప్రార్థనము సేయుచుఁ బుత్రాగమనంబు విని కడుముదంబున వచ్చి, తాపసవేషంబుల నున్న సీతారామలక్ష్మణులఁ జూచెను. చూచినంతనే యామె హృదయంబు చెదిరిపోయెను. ఆమె వారి యావేషంబులకుఁ గారణంబు నెఱుంగలేకపోయెను. రాముండు తల్లి పాదపంకజములకు భక్తిమీఱఁ బ్రణమిల్లి ‹‹ తల్లీ! అడలెదవేల? మున్ను నా తండ్రి కైకకొసంగెదనన్న వరద్వయంబిప్పుడామె కోరినది. అందు మొదటిది భరతునకుఁ బట్టముగట్టుట. రెండవది పదునాల్గు వత్సరంబులరణ్యంబుల వసింప నన్నంపుట. ఆ కారణంబునఁ దండ్రి సత్యంబు గాపాడుటకై యరణ్యంబులకేఁగ నే నీ తాపసవేషము భూనినాఁడను. వీరును నా వెంట నరుదెంచుచు. ఇందును

నీవు చింతింపవల," దని పలికెను. ఈ పలుకులు వినఁగనే యామె మిన్ను పై బడ్డ తెఱంగున నేలఁబడి మూర్ఛిల్లి కొంత సేపటికి లేచి, "హా! కుమారా! నా దుస్థితికి నేమని వగతును. కైక భరతునకు రాజ్యమిమ్మని యడిగిన నడుగ వచ్చును కాని నిన్ను వనంబులకుఁ బంపు మననేల? పతి యామెకు వశ్యుఁడై యుండినను నుండుఁగాక. ఇదియా చేయవలసిన కార్యము. ఇందుకు నృపాలుం డెట్లు సమ్మతించెను? సామ్రాజ్యభారముఁబూని, వసిష్ఠుండు దీవించి కట్టెడి యభిషేకపట్టము మోమున రాజిల్ల, నరుంధతీ ముఖ్య యోషిజ్జనంబు లుంచు సేస లొప్ప, నాకు నమస్కరించెద వని తలంచితినిగదా? అయ్యో! నందనా! ఇట్టి దారుణ మైన వార్త విన్నను నా హృదయము పగులకున్నది! సవతి యైన కైక యట్టికోరికఁ గోరినఁ గోరుగాక. నీ వెట్లు సమ్మతించితివోయి? వత్సా! పూర్వజన్మంబున నే తల్లికిని బుత్త్రునకును నెడఁబాలు సేసితినో, యా ఫలం బిప్పు డనుభవింప వలసి వచ్చినది. కృష్ణా! దైవంబు నేమని దూఱుదును. ఏమని శోకింతును? వనంబులకీ వరుగ, నేమని ధైర్యము దాల్తును? ఏమని పలవింతు? అయ్యో! భరతునకు రాజ్యంబు గావలసియుండెనేని మున్నే వేఁడక యా కైక నేఁడే యేల వేఁడవలెను. మనుజేంద్రుఁ డిచ్చినచో హాయిగా ననుభవింపరాదా. మగఁ డామెకు బ్రియుఁడై యున్నచో మాకంటె భోగభాగ్యములతోఁ దూఁగరాదా? నిన్ను వనవాసిగాఁ జేసినచో నామె యందఁగల లాభమేమున్నది?

ఎంత తెంపున కొడిగట్టినది ! ఎంత కనికరములేనిది ! సవతితనము చూపినదికదా !” యని పరిపరి విధంబుల వగలం బొగలుచున్న తల్లిం జూచి “తల్లీ ! కైక నాడుచున్నావు గాని, స్వమతధర్మము విచారించి పలుకవేల ? అమ్మా, భార్గవుండు తండ్రిపంపునఁ దల్లియగు రేణుకం జంపె. జనకాజ్ఞఁబూని కుండినుండు గోవధఁ జేసె. తండ్రియాజ్ఞ యెవ్వరికైనను గడవఁజనదు. కావున నేను తండ్రి సత్యవాక్యంబును బాలింపఁ దలంచినాఁడను. నీవు ధైర్యము వహింపు” మని ధైర్యము చెప్పెను. కౌసల్యయు ధైర్యము వహించి యిది దైవకృతమని తలంచి సమస్తదేవతలనుఁ బేర్కొని రాముని దక్షిణకరంబున రక్షఁగట్టి, “వత్సా ! అరణ్యంబులఁ దాపసుల తపంబులకు భంగముగావించు దానవుల వధించి, మునులను, సురలను, నుద్ధరింతువుగాక ! మున్ను వృత్రాసురుని గెలువఁబోవునపుడు దేవేంద్రునకు సమస్తదేవతలు నొసంగిన యాశీర్వచనంబును, నమృతంబునకేగునప్పుడు వినత విహంగాధిపతికిచ్చిన మంగళంబును, నిన్ను రక్షించుఁగాక !” యని పలికి వెండియు సుమిత్రాకుమారుని వీక్షించి, “కుఱ్ఱా ! నీవును నన్నవెంట నరిగెదవా ! సుఖివై మరలిర” మ్మని పలికి, జానకి నవలోకించి, “అమ్మా, జనకరాజ తనయా ! నీ తండ్రి రామునకు నిన్నొసంగునప్పుడీతఁడు సప్తద్వీపసముద్రముద్రిత మహీచక్రంబు నేకచక్రంబుగఁ బరిపాలించునని తలంచెనుగాని పాపజాతియగు కైకవలన నిట్టి కీడుమూడునని యెఱుఁగఁడ

య్యొఁగదా. సాధారణముగా సతివలు ధనవిరహితులగు పతులను దిగవిడుతురుగాని ధర్మమార్గముఁ దలంపరు. నిన్నుఁ జెప్పి వారిని జెప్పరాదు. రాముండు నిర్ధనుఁడుగాఁడు. ధనుర్ధరుడై యమ్మదెసఁ గనుగొన్నమాత్రమున వాసవభోగస్పర్ధియగు విభవ మితఁడు గనఁగలఁడు. దశరథుని శాసనమునకు దప్పుట దోషంబని తలంచి యీతని ధర్మవర్తనము లోకంబునకు విదితముసేయ నట్లరుగుచున్నాఁడు. వనవాసంబును గడపివచ్చి, తన నిర్మలకీర్తి చంద్రికలు దశదిశలన్ వెలుంగ రాజ్యంబు పాలింపఁగలఁడు,” అని పలికెను. అంత నా మువ్వురు నామెకు నమస్కరించి, యనుజ్ఞఁ గైకొని సుమిత్రాదేవి సన్నిధికరిగి వృత్తాంతం బెఱింగింప, నామెయు మిగుల శోకించి, తుదకు ధైర్యముఁబూని లక్ష్మణునిఁ జూచి “వత్సా, నీ యగ్రజుండయిన రాముని దశరథునిగా, జానకిని నన్నుఁగా, నరణ్యంబు నయోధ్యఁగా భావింపుము; ముగ్ధయగు జానకిని గడు జాగరూకతతో నరయవలయును. రాముఁడు నిద్రపోవునప్పుడు నీ వేమఱక శరాసనధారివై యుండవలయు” నని పలికి, వారు మ్రొక్క నాజ్ఞయిచ్చి యాశీర్వదించి పంపెను. అంతట నా మువ్వురును దాపసవేషంబులఁ బూని సుమంత్రచోదితంబైన రథమెక్కి పోవునప్పుడు పౌరులెల్లరును గంటఁదడివెట్టుచు గొందఱు కైకను, మఱికొందఱు మంథరను, మఱికొందఱు దశరథుని దూఱిరి.

శ్రీరాముండు సీతాలక్ష్మణయుతుండై యరణ్యంబుల కరుగుచుండెనని దశరథుండు విని కడురయంబున మందిరం

బును విడిచి, పరుగున వచ్చి, రథం బాఁపుమని సుమంత్రునిఁ
బిలిచి, రథంబును గలిసికొనఁజాలక, వసిష్ఠ ప్రబోధితుఁడై
మరలివచ్చి కైకంజూచి యామె ననేక విధంబుల దూషించిఁ
యచ్చోటువాసి కౌసల్య మందిరమునకరిగి శయ్యాతలముపైఁ
బడి, “ ఈపాటికి మా రాముం డెంతదూర మేఁగునో, యే
వృక్షముల నీడయందుండునో, భూపుత్రి యేగతినున్నదో,
ఆమె వాడినమోముఁజూచి రఘుకులరత్నం బెట్లు చింతించు
చుండునో, సౌమిత్రి నాదుష్టచరిత్రంబునకు నొచ్చి యేమని
పలుకుచుండునో ” యని పరి పరి విధంబులఁ జింతించె.

# జానకీదేవి.

## ఎనిమిదవ ప్రకరణము.

### * గంగోత్తరణము. *

జానకీరామలక్ష్మణులట్లు బయలుదేఱి దినదిన ప్రయాణంబులఁ జేయుచు గంగాతీరంబునకుఁ జేరిరి. అచ్చోట గుహుండను నిషాదనాథుండు వివిధములగు కానుకలఁ గొని తెచ్చి శ్రీరాములకర్పించి నమస్కరించి ముకుళితకరకమలుఁడై, "దేవా, నీవీ తపస్వివేషంబుఁ బూనినాఁడవేల? విగతసైన్యుండవై వచ్చినాఁడవేల? మీ బంటనగు నేనుండఁగా మీకింత ద్రోహముఁజేసినవారెవ్వరు? ఆ తుచ్ఛుని నామంబును జెప్పుఁడు. మద్బాణాగ్నిచే వానిని భస్మము గావించెద," నని పలుక, రాముండు వాని వీరోక్తులనుడిపి తన స్థితి దెలుప, నాతండు కైకదోషంబునకును, రాజు సవివేకంబునకును మిగుల చింతించెను. వారందఱు నా రాత్రి యచ్చోట విశ్రమించిరి. ప్రభాతంబున శ్రీరాముండు సుమంత్రుని విలోకించి రథము మరల్చుకొని యయోధ్య

కరుగుమని యాజ్ఞ నొసంగ, సుమంత్రుండు దీనవదనుండై కన్నుల బాష్పజలంబులు గాల్వలుగట్ట నేడ్చుచు, "రామా, మిమ్మొ యరణ్యంబులయందు డించి శూన్యరథముతోడ పురంబున కేరీతి మరలుదును. నిన్న రాముని సీతాలక్ష్మణ యుతంబుగా రథముపై నెక్కించుకొని పోయితివి, నేఁడు వారి నేమి చేసివచ్చితివని యడుగు పౌరులకేమని ప్రత్యుత్తరం బిత్తు. పంచప్రాణంబులకన్న నెక్కుడుగా నిన్నుఁ జూచి నిరంతరమును, "నా గుణరత్నాకరము, నా పెన్నిధానము, నా నోముల పంట, నా రవివంశదీపము" అని నిను స్మరించుచుండు ధశరథున కేతెఱంగున శోకమాఁపఁగలను. కౌసల్యా సుమిత్రల కేమి చెప్పుదును" అని పెక్కు తెరంగుల విచారించి, వెండియు, "నాయనా, రామభద్రా! నిన్నుఁ బాసి శూన్యరథంబుతోఁ బురంబున కేగఁజాలను. నీసేవఁజేయుచు నీవెంట నరుదెంచెద" నని పలుక, రాముండాతని నూరడించి, "దైవవిధి యలంఘ్యము. గంగానదిని దాటించి వచ్చితినని కైకమ్మగారు నమ్మునట్లు చెప్పుము. ముప్వురమ్మలకును దండ్రికిని మా నమస్కారములని చెప్పు," మని చెప్పెను. జానకియుఁ దాను తన యత్తలకుఁ బ్రణుతులు గావించితి నని చెప్పుమనెను. ఎట్టకేలకు సుమంత్రుఁడు ధైర్యము నవలంబించి వారిని విడిచి రథంబును మరల్చుకొని పోయెను. అనంతరము గుహుండు కర్ణధారుఁడుగా, నావ యెక్కి జానకీలక్ష్మయుతుండై రాముండు గంగానదిని దరించి దిన దిన ప్రయాణంబులఁ జిత్రకూటంబును జేరెను.

# జానకీదేవి.

## తొమ్మిదవ ప్రకరణము.

### * పాదుకా పట్టాభిషేకము. *

శ్రీరామునిఁ బాసిననాఁటనుండియు దశరథుఁడు నానాఁటికి క్షీణించెను. చిత్తంబునఁ జింత హెచ్చెను. "శ్రీరామ! శ్రీరామ!" యను వాక్యము దప్ప మఱియొక వాక్యమాతని నోటినుండి రాదయ్యెను. ఇట్లుండ రామాదులను విడిచివచ్చిన సుమంత్రుం డరుదెంచి వారు గంగానదిని దాఁటిరని చెప్పెను. ఎంత ధైర్యము చెప్పినను నాతనికిఁ జింత పోలేదు. తుద కాతఁడు రామునిఁ దలంచుకొనుచుఁ బ్రాణములఁ బాసెను.

ఈ సమయంబున భరత శత్రుఘ్ను లిరువురును, మేనమామయున్న గిరివ్రజపురంబున నుండిరి. అప్పుడు వసిష్ఠుఁడు రాజు కళేబరంబును తైలపక్వంబు గావించి, మంత్రులను బిలిచి గిరివ్రజమున కరిగి భరత శత్రుఘ్నుల దోడితెండని నియోగింప వారలరిగి భరత శత్రుఘ్నులం దోడితెచ్చిరి. వారు రాజ మందిరంబును బ్రవేశించి

యయ్యది కళావిహీనమై యుండుటకు మనంబున సందియ మంది లోనికరిగి, కైకవలన తండ్రి మృతియు, వరంబుల రీతియు నెఱింగిరి. కైక వాక్యంబుల విని భరతుండు కోపావేశపరవశుండై, " కటకటా! రామునిఁ గాంతారభూముల కరుగుమని చెప్పుటకు నీ నోరెట్లాడెను. అరణ్యంబుల నా రామచంద్రుండు జటాజినంబులు ధరించి యుండఁగా నే నిచ్చట రాజ్యమేలుచు భోగంబుల నందుదునని తలంచితివా? ఇట్టిది యెచ్చటనైనఁగలదా? అన్న మొగంబును నేను చూడఁగలనా! జననింవకుఁ బాల్పడితినిగదా! నీ గర్భంబున జనించుటచేత, నేనును బాపినై నాఁడనుగదా! నా చిత్తవృత్తి నెఱింగియు, రామునకు నాయందాగ్రహము గలుగునట్లు గావించినదానవు. ఇందువలన రామచంద్రుని చిత్తమెంత నొచ్చెనో, సుమిత్రా కుమారుండు నా మీఁద నెంత యాగ్రహించెనో, నీ మూలంబున నిట్టి చేటొనఁ గూడినది. నీవు రక్కసికిఁ బుట్టుటకు మాఱుగా నరజన్మ మెత్తినావు. నీతో సంభాషింపఁ దగదు," అని దూఱెను. ఈ సమయంబున నీ వాక్యంబులఁ జాటున బొంచి వినుచున్న మంథరను శత్రుఘ్నునకుఁ జూపి దీనివలన నిట్టిది సంభవించె నని యంతఃపురకాంతలు చెప్పిరి. శత్రుఘ్నుఁడు కోపావేశ పరవశుండై పరుగువెట్టిపోయి, మంథరనుబట్టుకొని చంపనున్న సమయంబున భరతుం డతనిని విలోకించి, " తమ్ముఁడా! దీనిం జంపినచో స్త్రీహంతల మని రామచంద్రుండు మన మొగంబులఁ జూడఁడు" అని వారించెను. పిదప భర

తుఁడు శత్రుఘ్న సమేతుండై తండ్రి కగ్నిసంస్కారాది కృత్యంబుల నెఱవేర్చెను. మఱునటి దినంబున, భరతుండు వసిష్ఠాదులఁజూచి రామునిఁ దోడితెచ్చి సమస్తరాజ్య శ్రీకి నభిషిక్తుఁజేసెద. అతఁడు రాఁడేని, నేనును వనంబులఁ దపస్వినై వర్తించెద" నని పలికి, ముప్వురు తల్లులును, మంత్రులును, వసిష్ఠాదులును వెంటరా బైలుదేరి గంగాతీరంబున విడిసెను. ఈ మాట నిషాదనాయకుండగు గుహుండు విని చెచ్చెర నచ్చటికివచ్చి భరతునిఁ జూచి, "ఓయీ! నీవేనా భరతుండవు, క్రూరాత్మురాలైన నీ తల్లియగు కైక రాముని వనవాసంబునకుఁ బంపినది చాలక నీ వాతనిపై నెత్తిపోవుచున్నావా? ఇంతసేయుట కాతఁడు నీకేమి కీడు సేసె. ఇఁక నిన్నొక్కయడుగైన నవతలఁ బెట్టనియ్యను. నీ సేన విఱిగిపోవునట్లు బాణాసారము కురిపించెద," నని వీర వాక్యంబులఁ బలికె. భరతుఁడు "నిషాదనాథా! నేను రామునిపై నెత్తిపోవుటలేదు. ఆ మహాత్మునిఁ దోడి తెచ్చి రాజ్య శ్రీకభిషిక్తుఁ జేయనెంచి యరుగుచున్నాను. కరుణించి మమ్మొ గంగ దాఁటించి మార్గంబుఁ జూపు," మని వేఁడెను. గుహుండు భరతుని యభిప్రాయంబును దెలిసికొని వారిని గంగదాటించి, మార్గము జూపెను. భరతుఁడు సకలసేనాసమేతుండై రాముఁడున్న చిత్రకూటంబును సమీపించెను. సైన్యార్భటింజూచి, లక్ష్మణుండు రాముని విలోకించి, "అగ్రజా, రామచంద్రా! భరతుండు మనపై నెత్తి వచ్చుచున్నాఁడు. నీవు యుద్ధంబునకు సన్నద్ధుఁడవు

గమ్మా. నీ శాంతియే యింతవఱకుఁ దెచ్చినది. ఇంక నే నావంతయు సైరింపక యాతని ప్రాణంబులఁ గొందు" నని పలుక రాముండు, "లక్ష్మణా! శాంతింపుము. భరతుండు నాకు మిగుల భక్తుఁడు. అతఁడు నన్నుఁ గొనిపోవు తలంపున వచ్చుచున్నాఁడ" ని పలికి తమ్ముని యుద్యమంబును వారించెను.

ఇంతలో భరతుండు తన సైన్యము నంతటి నొక్కచోట డించి, శత్రుఘ్న సమేతంబుగా నరిగి రామునిఁగాంచి తత్పాద సరోజంబులకుఁ నమస్కరించి తండ్రి మరణంబును వినిపించెను. సీతా రామలక్ష్మణు లొక్క పెట్ట శోకాబ్ధిలో మునింగిరి. కౌసల్యాది కాంతలు కుమారులఁ గౌఁగిలించుకొని రోదనంబు సేయసాగిరి. వసిష్ఠుఁడు వారినందఱ నూరడించెను. అంతట భరతుండు రాముని విలోకించి, "అగ్రజా! నీ రాజ్యభారము నేను వహింపఁజాలను. కైకకుజనించిన కారణంబున లోకనిందకుఁ బాలయినాఁడను. కావున నా తప్పెల్లను మఱచి నా యందుఁ గృపపూని నా విన్నప మాలకించి పురంబున కరుదెంచి పట్టాభిషిక్తుఁడవు గమ్మా. దీనికి నీవు సమ్మతింపవేని నీ ముందటఁ బ్రాయోపవేశంబు సేసెద" నని విన్నవించెను. రాముండు భరతుని విలోకించి, "తమ్ముఁడా, మన కులాచార ధర్మంబుల విచారింపక యిట్లు పలుకుచున్నావు. తండ్రి సత్యంబు గాపాడి తీరవలయును. వ్రతము పూర్ణమైన పిదపఁ బురంబున కరుదెంచెద" నని పలికెను. అప్పుడు వసిష్ఠుఁడు రాముని విలో

కించి "రామా! నీ తొడుగు పాదుకల నీ భరతున కొసంగుము. వానిని సింహాసనంబునఁ బెట్టి భరతుఁడు నీకు మాఱుగా రాజ్యంబుఁ బాలించు" నని పలుక, రాముం డందుకు సమ్మతించి తన పాదుకలు భరతున కొసంగెను. భరతుండు వానిఁ దన శిరముపైఁ బెట్టుకొని, రాముని యనుజ్ఞ గైకొని, సకల సేనాసమన్వితుఁడై యయోధ్యకు మరలివచ్చి యా పాదుకలను సింహాసనముపై నుంచి, ధర్మపద్ధతిని రాజ్యముఁ బాలించుచుండెను.





# జానకీదేవి.

## పదియవ ప్రకరణము.

### * శూర్పణఖ. *

శ్రీరాముఁడు సీతాలక్ష్మణయుతుఁడై చిత్రకూటంబును విడిచి, మార్గంబున ననేక మునివర్యులను సందర్శించుచు, మునుల కపకార మాచరించు పెక్కు రక్కసుల నుక్కడంచుచు, దండకారణ్యంబును బ్రవేశించి యచ్చట నొకపర్ణశాల గట్టుకొని వాసము చేయుచుండెను. రాముం డయ్యరణ్యంబునఁగల విశేషంబులను సీతకుఁజూపుచు నామె యుల్లంబున నుల్లాసంబుఁ గల్పించుచుండెను. లక్ష్మణుండు వారిరువురను సేవించుచు, రాత్రులయందు నిద్రవోవకఁ గృపాణధారియై యతిజాగరూకతతోఁ గాపాడుచు, వారికిఁ గావలసిన ఫలంబులు మొదలగునవి తెచ్చి యిచ్చుచుండెను.

ఇట్లు వారప్పర్ణశాలయందు సుఖంబుగాఁ గాలంబుఁ గడపుచుండ నొక్క దినంబున, రావణుని సోదరియగు

శూర్పణఖ యయ్యరణ్యంబునఁ జరించుచు, నప్పర్ణశాల
యొద్ద కరిగెను. అప్పుడు లక్ష్మణుండు ఫలంబులఁ దెచ్చు
టకై యరిగియుండెను. సీతారాము లిరువురును సరస
సల్లాపంబు లాడుకొనుచుండిరి. శూర్పణఖ రామునిఁజూచి
యాతని సౌందర్యంబున కచ్చెరువంది మోహావేశ పరవశయై
యతనింజేరి వృత్తాంతంబంతయు నడుగ, రాముం డెఱిం
గించెను. శూర్పణఖ యతనినిఁ దన క్రేగంట వీక్షించుచు,
" రామచంద్రా ! నీ వృత్తాంతము నీవు చెప్పినాఁడవు. ఇఁక
నా వృత్తాంత మొకింత యాలింపుము. లంకానాయకుండై
త్రిలోక భయంకరుండై యొప్పుచున్న దైత్యనాయకుండగు
రావణుని చెల్లెలను, శూర్పణఖ యనుదాన " నని పలికెను.
రావణునిపేరు చెప్పినంతనే సీత శిరఃకంపముఁ జేసెను. రా
ముఁడు శూర్పణఖను యచ్చటి కరుదెంచుటకుఁ గారణమడుగ
శూర్పణఖ యాతనిని విలోకించి, " నృపాలవర్యా, చెప్పుట
కేమున్నది. ఇవ్వనంబునఁ జరించుచు నిన్నుఁజూచితిని.
నా హృదయంబు నీ యందుఁ జిక్కినది. ఈ కొలమాలిన
దుర్లక్షణయగు భార్య నీకెక్కడ దాఁపురించినది. దీనిని
మ్రింగెదను. అనంతరము మన మిరువురమును సుఖింత "
మనెను. రాముండామాట విని " కాంతా ! నాకొక
తమ్ముఁడున్నవాఁడు. ఆతఁడు ఫలంబులు దెచ్చుట కా
ప్రాంతంబున కరిగియున్నవాఁడు. ఆతఁడు నీకుఁదగినవాఁడు.
సౌందర్యంబున నన్ను మించినవాఁడు. అతనిపాలికరగుము, "
మని చెప్పెను. అంతట శూర్పణఖ యచ్చోటువాసి, లక్ష్మ

ణునికడ కరిగి, తన కోరికఁ దెలుప నాతఁడిట్లనియె. "రమణీ! నీకీవెఱ్ఱి యేమి? ముల్లోకంబులయందును నేర్పరులలోఁ దిట్ట యయిన రాముఁడుండగా నాకడ కరుదెంచినావేల? నీ చిత్తం బెట్లుండునో యెరయుటకు రాముఁడు నిన్ను నాకడ కంపినాఁడు. మరల నీవాతనియొద్ద కరుగుము. అతఁడు నిన్నుఁ దప్పక చేపట్టును."

ఈ వాక్యంబుల విని యామె మరల రామునింజేరి, యభీష్టంబుఁ దీర్పుమని యడిగెను. అప్పుడు జానకి నవ్వఁగా. శూర్పణఖ కోపావేశపరవశయై యామెను మ్రింగఁబోయె. రాముం డన్నిశాచరింబట్టుకొని, యచ్చటి కప్పుడే యరుదెంచిన లక్ష్మణుని విలోకించి, "తమ్ముఁడా, క్రూరులును, దుష్టాత్ములును నగువారితో నెప్పుడును, బరిహాసము తగదు. కావున దీనిని విరూపంజేయు," మని పలుక, లక్ష్మణుండా రక్కసి ముక్కుం జెవులను జెక్కెను. వికృతరూపయై యా శూర్పణఖ పెద్దపెట్టు శోకించుచు, నయ్యరణ్యంబున నున్న ఖరదూషణులను దైత్యులతోఁ దన భంగపాటుఁ జెప్పుకొనె. వారిరువురును రామునిపై నెత్తివచ్చి యతనిచే నేలఁగూలిరి.

# జానకీదేవి.

## పదునొకండవ ప్రకరణము.

### * కురంగము. *

ఖరదూషణాదుల సైన్యంబున, రామునిచేఁ జావక మిగిలిన యకంపనుఁడను నొక రాక్షసవీరునివలన రావణుండు ఖరదూషణాదుల మృతియు, రాముని వనవాస వృత్తాంతంబు నెఱింగి, జానకి నెట్లయిన నపహరింపఁ దలంపుఁబూని యుండెను. ఇంతలో శూర్పణఖ యచ్చటికరిగి రావణునకు నిజపరిభవంబు నెఱింగించి, జానకిపై నాతనికి మోహము జనించునట్లామె సౌందర్యమునుగూర్చి విశేషంబుగ నుగ్గడించి వెండియు, నాతనికి రోషముగలిగించుటకై, ,, అగ్రజా, రామలక్ష్మణు లిరువురును బలపరాక్రముల యందొకరి కొకరు దీసిపోవరు. సీతంబోలిన సౌందర్యవతి ముల్లోకంబుల యుండును లేదు. ఆమె నీకుఁదగిన కాంత యని నొక్కి వక్కాణింపఁ గలను. వేయేల? ఈ లంకాభాగ్య మేల? అమరేంద్ర పదంబుఁ గోరనేల? ఆ జానకి నీకు లభిం

చినఁ జాలు," నని పలికెను. రావణుండు సోదరి పరాభవంబునకు మిగులఁగుంది, యామెకట్టి కీడుఁజేసిన రాఘవుల పైఁ బగదీర్చుటయు, నెట్టి మాయోపాయముల చేతనయి నను జానకిని దెచ్చుటయు, ముఖ్యకార్యములని తలంచి, సోదరి నూరడించి, దానిబన్నమునకుఁ బ్రతీకారము సేయుదు నని పలికె.

అనంతరము రావణుండు రత్నకాంచన మయంబును, గామ గమనంబును, వివిధాయుధభరితంబునగు రథంబెక్కి గగనమార్గంబున బయలుదేఱి మారీచాశ్రమంబును జేరెను. మారీచుఁడు రావణునిఁజూచి తగు విధంబుల నాదరించి యిష్టగోష్ఠిందగిలియున్న సమయంబున రావణుండు తన రాకకుఁ గారణంబెఱింగింపఁ గోరి యిట్లుపలికె. "మామా! శ్రీరాముండనువాఁడు తండ్రి సత్యంబుఁ బరిపాలింపఁదలఁచి, భార్యతోడను, దమ్మునితోడను వనంబులకరుదెంచి దండకాటవి నివసించుచు మన శూర్పణఖకు ముక్కుఁజెవులఁ గోయుటయేకాక జనస్థానంబునందున్న ఖరదూషణాది రాక్షనుల నేలఁగూల్చె, కావున నేనారాముని భార్యయగు జానకిని నీసాయంబునఁ దెచ్చుటకై యరుదెంచినాఁడ. అబ్జాసన సృష్టియందు మాయలలో నీకు సమానుఁడైన వాఁడెవ్వఁడును లేఁడు. కావున నేమాయోపాయంబునైనఁ బన్ని జానకిని నేను దోడ్కొని వచ్చునట్లు గావింపుము."

మారీచుఁ డీమాటలు వినఁగానే శిరఃకంపమాచరించెను. అతనికి శరీరమంతయుఁ జెమటలు గ్రమ్మెను. అదియొక

తీరైన భయంబుపుట్టెను. అప్పుడాతఁడు రావణునకిట్లనెను. “ దైత్యేశ్వరా, రాముని శౌర్యపరాక్రమములంగూర్చి నాకు సంపూర్ణముగఁ దెలియును. విశ్వామిత్ర క్రతు భంగము సేయుట కరిగినప్పుడు రామలక్ష్మణు లిరువురును క్రతు సంరక్షకులుగా నరుదెంచిరి. రాముఁడు సహస్ర దంతిసత్త్వుండనగు నన్నే యొక్క బాణంబున సముద్రంబునఁ బడునట్లేసెను. అతని పిన్ననాటి యస్త్రబలంబే యట్లుండగా నిప్పటిమాటఁ జెప్పనేల? నాఁటినుండియు నేను దుష్కృత్యముల నాచరింపక యిచ్చటఁ దపముఁ జేసికొను చున్నాఁడను. ఆతఁడు నాపై బాణమేసిన నాటనుండియు నెటఁజూచినను రఘువరుండు గనిపించుచున్నట్లే యుండును ” అని పెండియు, “ నీచపథంబున వర్తించు నట్లొనర్చువారు పెక్కండ్రుగలరు. దేవేంద్రాదులు వెట్టిసేయ మహావైభవంబున లంకనేలుచున్న నీవు శ్రీరాముని నొక సామాన్య మానవునిగాఁదలంచి యీ దుష్కార్యమేల చేయనెంచినాఁడవు? ఈ కొఱగాని కార్యము సేయుమని యెవ్వఁడు నీకు బోధించె? ఇట్లు సేయుట రాక్షసవంశమునకు వినాశకరమని తలంపుము. ధరాభారాపనోదార్థమై క్రూరదానవుల సంహరింప విష్ణుండే రామాకృతిని జనించినాఁడని యెఱుంగుము. ఖరాదులను ద్రుంచిన యా రామునిమీఁదికి నీ పంపున నెట్లు పోవఁగలుగుదు. సీతాపహరణంబునుగూర్చి తలపెట్టక లంకకు మరలిపొమ్ము ” అని హెచ్చరించిచెప్పెను.

రోగికిఁ బథ్యంబు రుచించనట్లు రావణుని కాతని హితోపదేశంబు లాగ్రహంబుఁ గలిగించె. రావణుఁడతనిం జూచి, “ నిన్ను నేను నీతులు గఱపుమని వేఁడుకొనలేదు. చేతనైనచో నాకు సహాయుఁడవుగమ్ము, ” అని కోపంబునఁ బలికె. మారీచుండు తన మనంబున, “ నేనీ కార్యము సేయనని చెప్పినచో నీతఁడు నన్ను వధించును. ఈతనిచేఁ జచ్చుటకంటె రామునిచే మడిసి మోక్షము నందుదు,” నని తలంచి, రావణుని విలోకించి, “ దానవేశ్వరా, నా విషయమై నీవు సందియమందవలదు. నేను మాయాకురంగంబనై జానకిని రామలక్ష్మణు లెడఁబాయునట్లు చేసెద. అప్పుడు జానకిని నీవు దోడ్కొనిపోవచ్చు”నని పలికి మాయాకురంగమై బయలుదేఱెను. రావణుండును నాతని విధంబు నరయుచు నా ప్రాంతంబునందే చరించుచుండెను.

సీతారామ లక్ష్మణులు పర్ణశాలయందేదియో సంభాషించుచుఁ బ్రొద్దుపుచ్చు సమయంబున మాయలేడి వారి యెదుటి కరుదెంచి వివిధ చిత్రగతులం జూచుచు నడవ సాగెను. ఒక సమయంబునఁ బెంపుడులేడియో యనునట్లు శ్రీదేవిని సమీపించును. ఆహరిణంబును జూడఁగనే వారి కందఱకు నద్భుతంబు జనించి యట్టిదానిని వారు మున్నెన్నఁడును జూచియుండలేదనుకొనిరి. ఆ లేడి చేష్టలన్నియు జానకికి కడుముదముఁ గూర్చుచుండెను. అప్పుడు జానకి శ్రీరామునింజూచి, “ నాథా ! యొప్పులగనియగు నీమృగంబునుఁ జూచితివా ! దీనితో నాడుకొన నాకెంతయు ముచ్చట

యగుచున్నది. కావున నాయందుఁ గృపఁబూని యీ మృగంబునుఁ బట్టితెచ్చి నా కొసఁగుము. ఒకవేళ నిది దొరకకపోయినచో దీని చర్మమైనను దెచ్చి యొసంగు" మని కోరెను. రాముడందుకు సమ్మతించి లక్ష్మణుని విలోకించి, "తమ్ముడా! యీ మృగలోచన యీ మృగంబును బట్టి తెచ్చి యొసంగుమని వేఁడుచున్నది. కావున నేసరిగివచ్చెద. అంతవఱకును నీమె నతి జాగరూకతతోఁ గాపాడుచుండు," మని పలుక లక్ష్మణుండు, "అగ్రజా! ఇట్టి హరిణంబును మనము మున్నెన్నఁడునుఁ జూచియుండలేదు. ఎవ్వఁడో రక్కసుఁ డీరూపముఁ దాల్చి మనల వంచింపఁదలఁచి వచ్చి యుండును. కావునఁ జనఁదగ" దని పలికెను. రాముండు, "తమ్ముడా! అడిగిన వస్తువులు తెచ్చుచుండుటచేతనే యీ యబల యీ కాంతారంబునఁ గుఃఖంబుడిగియున్నది. ఇయ్యది పసిఁడి మృగమైనచోఁ బట్టితెచ్చెద. లేక నీవు చెప్పినట్లు రక్కసుండయ్యేనేని తునిమి మునులఁ గాపాడెద" నని పలికి బాణంబుల ధరించి, మృగము వెంట నంటెను. ఆమాయామృగంబు రామునకు దొరకునను నాశ గలుగఁ జేయుటకై యాతఁడు దగ్గఱ కరుదెంచువఱకు నిలుచుచు, ఒక్కొక్కచోఁ గుప్పిగంతులు వేయుచుఁ జంగు చంగున దాటుఁచు, బరుగుపెట్టుచు, శ్రీరామునిఁ జాలదూరంబునకుఁ గొనిపోయెను. ఇట్లమితదూరంబున కరిగి శ్రీరాముండు దానిఁ బట్టఁజాలక "యిది మాయామృగంబై యుండనోపు.

ఇంక దీని రూపుమాపెద," నని నిశ్చయించి బాణంబును సంధించి విడిచెను.

బాణంబు దగిలి లేడి తన నిజఘోరరూపంబు ధరించి, "హా! లక్ష్మణా! జానకీ!" యని బిగ్గఱగానఱచి ప్రాణంబులఁ బాసె. రఘువరుండు మారీచుని ఘోరాకారంబుఁ జూచి యంతరంగంబున, "తమ్ముఁడు చెప్పినట్లిది మాయామృగమే. ఈ రక్కసుండింతదూరము నన్నుఁ దెచ్చినాఁడు. అక్కడ లక్ష్మణుని నేదైత్యులు పొదివిరో, వారెట్లున్నారో, జానకీ సౌమిత్రులను మరలఁ జూడగలుగుదునో లేనో," యని విచారించుచుఁ బర్ణశాలవంక బైలుదేరెను.



# జానకీదేవి.

## పండ్రెండవ ప్రకరణము.

### * అపహరణము. *

"హా! లక్ష్మణా! జానకీ!" యను నార్తరవము జానకీ శ్రవణంబులకు సోకినంతనే యామె చిత్తంబు కలఁతఁ జెందెను. శరీరమంతయుఁ గంపమెత్తెను. అప్పుడామె లక్ష్మణుని జూచి "మఱఁదీ! వింటివిగదా రాముని యార్తరవము. ఆతఁడు మహాపద నెద్దానినో పొందియుండినఁ గాని యిట్లు కేకవేసియుండఁడు. కావున నీవీక్షణంబరిగి యాతనిజాడ నరసిరమ్ము," అని యేడ్చుచుఁ బలుక లక్ష్మణుండిట్లు పలికె: "తల్లీ! భయమందఁ బనిలేదు. ఆకాశము విఱిగి పైఁబడినను నాతఁడు చలించువాఁడు కాఁడు. వాసవపద్మజ రుద్రులైనను నాతని నెదిరించి నిలువఁజాలరు. ఎవ్వఁడో మాయరక్కసుండొకఁడు మనల వంచింపనట్లు కేక వేసినాఁడు గాని రాముఁడు త్వరలోనే రాఁగలఁడు."

లక్ష్మణుని పలుకులామె చిత్తంబునకు ధైర్యమిచ్చినవి కావు. అంతియేకాక యామె యతనిపై నలిగి, "సౌమిత్రీ! నేను బ్రతిమాలుకొన్నను నీ వరుగకున్నావు.

నా కెన్నియో ధైర్యముగల్గు వాక్యంబులను జెప్పెదవు. నీ హృదయము వజ్రమయమైనది కాఁబోలు. సవతికొడుకులు పగవారనుమాట నేఁడు సత్యమైనది. తమ్ముఁడొకఁడు రాజ్యమునుండి వెడలనడిచినాఁడు. ఇంక నీవు నాకై రాముని చావుకొఱకు వేచియున్నట్లు గనఁబడుచున్నది. ఛీ! నీ ముఖంబుఁజూచినఁ బంచమహాపాతకంబులును సంభవించు," నని నిష్ఠురంబుగఁ బలికెను. లక్ష్మణున కామాటలు శూలమువలె నాటెనవి. అతఁడామెఁ జూచి, "తల్లీ! అగ్రజుండు తానరుదెంచువఱకును నిన్నతిజాగరూకతతోఁ గాపాడుచుండుమని యాజ్ఞ నొసంగియుండుటచే నట్లు పలికితిని. నా చిత్తవృత్తి నెఱింగియు నిట్టి వాక్యంబు లాడితివి. భీకర రక్షోమృగ సంకులంబైన యిమ్మహారణ్యంబున నిన్నొంటిగా డించిపోవుటకు నాచిత్తంబు సమ్మతింపకున్నది. అయినను నీ యాజ్ఞఁబూని యరిగెద," నని పలికి చనెను.

లక్ష్మణుండరిగిన పిదప జానకి వాకిట నిలిచి రాముఁడు వచ్చుచుండెనేమో యని యెదురు సూచుచుండెను. ఏ చప్పుడైనను రాముని యడుగుల చప్పుడేయని తలంచుచుండెను. ఇంతలో, మారీచుండు రామలక్ష్మణుల వంచించిన విషయము నా ప్రాంతమునందేయున్న రావణుం డెఱింగి, సన్యాసివేషముఁబూని పర్ణశాలయొద్ద కరిగెను. జానకి యాతనిం గిలకించి యెవ్వఁడో యొక మహాత్ముఁడని తలంచి, భక్తితో నర్ఘ్యపాద్యంబుల నొసంగెను. రావణుండు వానిం గైకొని యామెను విలోకించి, "ఇంతి, నీ

వెవ్వరి దానవు ? నీ నామ మెయ్యది ? ఇక్కాంతారంబున వసించుటకు గారణమే ?" మని యడుగ, జానకి తన వృత్తాంతంబంతయు నెఱింగించెను. రావణుండు తన వృత్తాంతంబు నామెకుఁ దెలియఁజేయఁదలంచి, "రమణీ మణీ, నీ వృత్తాంతంబుఁజెప్పి నాకు ముదంబుఁ గూర్చితివి. నా వృత్తాంతమును నొక్కింత వినుము. పులస్త్య బ్రహ్మ సుతుండయిన విశ్రవసుండు మదీయజనకుండు. లంకా పురంబు మదీయ రాజధాని. నా పేరు రావణుండందురు. ఏకాగ్రమానసుండనై బ్రహ్మంగూర్చి తపంబొనర్చి యనేక వరంబులఁ గాంచినాఁడను. దేవేంద్రాదులు వెట్టిసేయ దైత్య రాజ్యంబును మహా వైభవంబునఁ బాలించుచున్నాఁడ" నని పలికెను. రాక్షసుఁడన్నమాట వినినంతనే భయమందు నామె కాతఁ డరుదెంచి యెదుట నిలిచినప్పుడు హృదయ మెంత కొందలమందియుండునోకదా. రావణుం డామెను వీక్షించి, "ఓ జనక భూపాలపుత్రీ ! నన్నుఁజూచి భయ మందవలదు. నీ సౌందర్య విశేషంబును నా చెలియలగు శూర్పణఖవలన విని నిన్నుఁజూడ నరుదెంచినాఁడను. నా భాగ్యవశమున నిన్నిచ్చటఁ గన్నాఁడను మూఁడు లోకం బుల యందును నీ యందముగల సుందరవదనను జూచియుండ లేదు. నిన్నుఁజూచిన యంతనే మారుండు తన కలుకుటమ్ము లను నాపైఁ బఱపసాగినాఁడు. హీనుఁడైన రామునితో నీ వనములయందేల కష్టంబుల నందెదవు ? సుకుమార శరీ రంబు నిట్టి యునికిచే నేల గాసిలఁ జేసెదవు. నాతోడ

తమ్ము. పట్టపు దేవిగా నిన్నుఁ జేసెద" నని చెప్పెను. జానకి యా పలుకులు విని తన మనంబున "మాయ సన్యాసియని తెలియక వీనిని బూజించితినిగదా" యని భావించి వానిని విలోకించి, "రావణా! పులస్త్యబ్రహ్మ కులంబున జనించి, సమస్త శాస్త్రంబులఁ జదివిన నీవీరీతిఁ బరాంగనలను గోరవచ్చునా?" యని పలికి వెండియు నిట్లు వచించె. "సకల సౌభాగ్యకాసారమునకు నాత్మధవుఁడే రాజహంస. సంతాప దావాగ్ని శాంతింపఁజేయుటకు నిజ భర్తయే వృష్టిధార. సంసారమను మహాసాగరంబునఁ దేలు భార్యయను నౌకకు భర్తయే నావికుండు. దుఃఖాబ్ధిఁ దరింపచేయుటకు భర్తసేవయే నావ. స్వర్గపురంబుఁ జేరు టకుఁ బ్రాణేశ్వరుని సేవయే రాచబాట. సహధర్మచారిణీత్వ వ్రతమ్మునకు నాథుఁడే యుపాస్యదేవత. అతిపాపసముద యారణ్యముఁ జెరుకుటకుఁ బతిసేవయే కుఠారధార. ప్రాణ నాథుని పాదపద్మసేవయే సకలకార్య నిర్వాహకంబు. దానికి వ్యతిరిక్తంబుగా వర్తించుదానను గాను." ఈ పలుకులు దానవుండు వినక పెక్కు దుర్భాషలాడ నామె యతనిం జూచి, "దానవేశ్వరా! ఎప్పుడును బతివ్రతల శీలభంగము చేయ కోరికఁ జిత్తంబునఁ బూనకుము. పరకాంతాసక్త మానసులకు ముక్తికాంత దూరంబగును. రామునిఁ దప్ప నితరులను గన్నెత్తియైనను జూచుదానను గాను. నీవు మహాశాస్త్రవేత్తవు. కావున నీ బుద్ధి మరలించుకొని సుజ నులు పోవు పథంబునఁ బొమ్ము. కానిచో రఘురాముండు

నిన్నుఁ వన శరాగ్నియందు హోమముసేసి తీరును. నన్నుఁ గోరుట దైత్యవంశ నాశనంబునకు మూలకారణంబని యెఱుంగుము. సురాసురులనైనను సరకుగొనని శ్రీరాముని కాగ్రహంబుఁ దెప్పించుట గరళంబుఁ గ్రోలఁదలంచు విధమని భావింపు," మని పలికెను.

రావణుం డామెను విలోకించి, "రమణీ! ఇంద్రుఁ డాదిగాఁగల దేవతలు నా కూడిగంబులుసేయఁ ద్రిలోక భీకరుండనైయొప్పు నా ముందఱ రాముని గీముని వచియించుచున్నావు. నీచనరుఁడైన నీ భర్త శౌర్యపరాక్రమంబులకు నేను భీతిల్లువాఁడనుగాను. ఇదిగో! నా నిజాకృతింజూడు," మని పలికి పది శిరంబులు, నిరువది చేతులును, గల తన నిజ రూపంబునుఁజూపె. జానకి రావణుని నిజరూపముఁజూచి భయంబందిమూర్ఛిల్లెను. అప్పుడు రావణుం డామెను గొనిపోవుట కదియే మంచిసమయంబని తలంచి, యామెను రథంబుపై నుంచుకొని లంకాభిముఖుఁడై చనుచుండె. రథంబుపై నున్న జానకి కొంత తడవునకు మూర్ఛఁదెలిసి రావణుండు తన్నుఁ గొనిపోవుచున్నాఁడని యెఱింగి, పలుదెసలు గలయంగనుంగొని రామ లక్ష్మణుల నుద్దేశించి బిగ్గఱగా, "ఓ లక్ష్మణా! నీ వాడిన వాక్యంబుల నాలింపక నిను నిష్ఠురంబులాడి పంపినందుకు ఫలం బనుభవించుచున్నాను.

"శా॥ అన్నా లక్ష్మణ నిన్నుఁ బుణ్యనిధి నే ♦ నజ్ఞాననై పల్కితిన్
నన్నా పాపము వచ్చి ముట్టికొనియెన్ ♦ నాపాలిదైవంబవై
యున్నీచుం బరిమార్చ వేగ పఱతే ♦ వే నన్ను రక్షింప మీ
యన్నం గన్నను జీరవే యరుగవే ♦ యత్యుగ్రశీఘ్రంబునన్॥"

ఇదిగో, రావణుండను దైత్యుఁడొక్కఁడు తన రథంబుపైఁ బెట్టుకొని నన్నుఁ గొనిపోవుచున్నాఁడు. సత్వరంబుగఁ దేరి కడ్డమువచ్చి వీనిం దునిమి నన్ను రక్షింపుము. ఓ నిఖిలలోక శరణ్యా! ప్రాణేశ్వరా! రామచంద్రా! ఒంటిగా నున్న నన్నీ మ్రుక్కఁడి రక్కసుండు గొనిపోవుచున్నాఁడు. దిక్కులేక విలపించు నన్ను రక్షింప నరుదెమ్మ" అని కేకలిడి, ఎవ్వరును రాకుండుటకు మిగుల శోకించుచు నీవిధమున పరితపింపఁదొడఁగెను.

"సీ॥ పావనాకార గో ♦ దావరీదేవి నీ, వెఱిగింపవమ్మ రా ♦ జేంద్రుతోడ
నోమాల్యవంత పు ♦ ణ్యోన్నత గిరినాథ, చెప్పంగదే రాజ ♦ సింహుతోడ
నోజనస్థానమ ♦ భూజములార యీ, విధ మెఱిఁగింపరే ♦ విభునితోడ
నోదండకాటవి ♦ నున్న తాపసులార, నాపాటు చెప్పఁడీ ♦ నాథుతోడ
తే॥ గీ॥ నేను శ్రీరామభార్య మీ ♦ రెవ్వరైన
నడ్డపడి తాఁకి విడిపింప ♦ రయ్య కావ
రయ్య సురలార మునులార ♦ యక్షులార
యఖిల దిక్పతులార పు ♦ ణ్యాత్ములార ॥"

జానకి దీనాలాపంబులు జటాయువను పక్షీంద్రుఁడాలకించి, "అమ్మా, వెఱవకు, వెఱవకు. ఈ దానవుని నేను బోరిగొని నిన్ను విడిపించెద" నని పలికి గడురయంబున వచ్చి, రావణుని దాకెను. రావణునకును జటాయువునకును ఘోరయుద్ధంబు జరగెను. ఆ యుద్ధము జరగునప్పుడు జటాయువునకు జయంబు గలుగుటకై జానకి పరమేశ్వరునిఁ బ్రార్థించెను. కాని, జటాయువు తన శక్తి తఱుఁగునంతవఱకును బోరాడి రావణునిచే విగతపక్షుఁడయ్యె. అంతట రావణుండు, జానకిని గొనిపోవునెడ నామె, "రామా!

రామా !" యని వెలుంగుసేయసాగెను. ఆమె తన మనంబున, "అక్కటా ! ప్రాణేశునిఁబాసిన నా తనువిఁక నీ భూమిపై నుండనేల ? నాథుండును, మఱఁదియు నేనీ యసురునిచేఁ జిక్కువడిన వార్త యేమెఱుంగుదురు ?" అని నిట్టూర్పులుపుచ్చుచు రోషావేశంబున దశకంఠుని విలోకించి, "ఓరీ ! నీచాత్మా, రావణా ! మాయాతాపసుండవై నన్ను వంచించి తెచ్చితివి. వీరున కిదియా లక్షణము. పేరుచెప్పి నా పతి నెదుర్కొనరాదా. అదియుంగాక యింక నొక్క త్రుటికాల మచ్చట నున్నచో నా నాథుం డరుదెంచి నీ యంతముఁ జూడకుండునా ? నేనే నిన్ను నీఱుగాఁ జేయగలుగుదునుగాని నా విశ్రుతియును సుకృతంబును జెడును. ఖరదూషణాది రాత్రించరుల నొక్కఁడే కూలనేసిన మన్నాథునితోఁ దొడరనెంచుట భవదీయ వంశనాశనంబునకని యెఱుంగుము. ఇప్పుడైనను బుద్ధిఁదెచ్చుకొని, నా విభునకు నన్నప్పగింపుము. లేనిచో నా వార్త నెట్లయిన నాతఁడు తెలిసికొని, సంగ్రామరంగంబున నిన్నుఁ బుత్రామాత్యభృత్యాది వర్గంబుతోఁ గూల్చితీరు" నని పలికెను. రావణుం డామె మాటలు సరకుగొనక యామెం గొనిపోయెను. ఆమె పోవునెడ నొక్క గిరిశృంగమునందు కపివీర పంచకంబును దిలకించి వారైనను దనవార్త రామున కెఱిఁగింతురని తలంచి కొన్ని భూషణంబులఁదీసి చీరకొంగొక్కింత చింపి దానంగట్టి వారి ముందఱ విడిచిపెట్టెను. రావణుండామెను లంకకుఁ గొనిపోయి, యశోకవనంబునందుంచి రక్షస్త్రీలఁగాపుంచెను.



# జానకీదేవి.

## పదమూడవ ప్రకరణము.

### * అన్వేషణము. *

అక్కడ రాముండు మారీచుఁ దునిమి సత్వరంబుగ జానకిం జూడఁ జిత్తంబునఁ దత్తరమందుచు నరుదెంచున ప్పుడు తన మనంబున, "మారీచుని కృత్రిమ భీమస్వరం బును విని జానకి యెంత దిగులొందియుండెనోకదా. ఒం టిగానున్న లక్ష్మణు నేదానవులయిన గవిసిరో, వారిరు వురు నేగతినున్నారో కదా," యని తలంచుకొనుచు వచ్చు చుండ నాతనికి దీనాననుండైన లక్ష్మణుండు కనిపించెను. లక్ష్మణునిఁ జూచినంతనే యాతని హృదయము చెదరిపో యెను. రాముండు తమ్మునిఁ జూచి, "తమ్ముడా! నే నిప్పుడు వచ్చుచుండ మార్గమధ్యంబునఁ బెక్కు దుర్నిమిత్త ములఁ గంటిని. మాయామృగంబయిన మారీచుఁడను రక్కసుండు నన్నింతదూరము దెచ్చినాఁడు. జానకిని బాసి నీ వింతదూరం బరుదెంచినావా? నిన్నుఁ జూడఁగనే

నా యెడమ భుజంబును, నెడమ కన్నును నదరుచున్నవి. అక్కటా! జనకరాజ తనూజ యెట్లున్నదో కదా! రాక్షసు లెవ్వరు నామెను వంచించి యుండరుగదా! క్రూర మృగంబు లేవియు నామెను భక్షించి యుండవుకదా! సకల రాజ్య సంపదలను దృజించి యతి దీనుఁడనై వనంబులఁ గరుదెంచు నప్పుడు నా వెంట వచ్చి దుఃఖములఁ బొల్గొనిన జానకి పర్ణ శాలయందెట్లున్నదో? ఆమెలేని నా తనువేల? అక్కాం తంబాసి యొక్క క్షణమైనను బ్రాణంబుల భరించి జీవింపఁ గలనా? ఖరాదులను నేను జంపితినని రాక్షసేశ్వరుండెఱింగి రక్కసులఁబంప వారరుదెంచి నా ప్రాణేశ్వరిని గ్రహించిరో ఆమెంబాసి యెక్కడకును నరుగక యతి జాగరూకుఁడవై యుండుమని చెప్ప నిట్లేలవచ్చినాఁడవు?" అని చింతంబొం దుచుఁ బలికెను.

లక్ష్మణుండగ్రజుని విలోకించి, "అన్నా, ఆ మాయ రక్కసుని రవంబును విని జానకి మిగుల బెగడొంది, "రాము స కేహాని వాటిల్లెనో యరసి ర'మ్మని పలుక నేను ధైర్యము చెప్పితిని. నన్నామె కడు నిష్ఠురోక్తులాడెను. ఆ కారణం బున నరుదెంచినాఁడ మన్నింపు" మనియెను. రాముండు "స్త్రీ యగుటచే వేగపడి యనుచితవాక్యంబులఁ బలికి యుండును. అవి నీవొక్కింత సైరింపఁజాలక యిట్లామెను విడిచి వచ్చినావా? ఆ యింతి నిన్నుఁ బొమ్మన్నంతనే కోపాయత్తుఁడవై యిట్లు వచ్చితివా? తమ్ముఁడా, నాబలం బీవెఱుంగుదువు. నిన్నును నన్నును వంచించు దానవు లా

నాతిని గొనిపోవకుందురా. మనకన్నియు నశుభంబులే తోఁచుచున్నవి," అని పలుకుచు లక్ష్మణునితోఁ బర్ణశాలను సమీపించెను.

శారికలేని పంజరమురీతి, నలినసంగతి గానరాని కొలనికైవడి, చంద్రికలేని నిశాగగనముమాడ్కి, దీపిక లేని మందిరముభాతి, శూన్యమయియున్న పర్ణశాలంగాంచి యుల్లము తల్లడిల్ల మెల్లఁగా, రాముఁడందుఁ బ్రవేశించెను. జనకజ యట గానిపింపలేదు. రాముని హృదయంబు చెదరిపోయెను. ఆమె జలంబుఁ దెచ్చుటకుఁ గాసారంబున కరిగెనో, లేక సమీప వనమందెచ్చటనైన విహరించుచుం డెనో యని తలఁచి రాముఁడాయాస్థలంబులన్నియు వెదకెను. ఎక్కడను జానకి కనఁబడదయ్యె. రాముని చిత్తంబధికశోకా యత్తమై యతఁడు వనంబు ప్రతిధ్వనులిచ్చునట్లు శోకిం చుచు, "జానకీ! జానకీ!" యని పిలువసాగెను. ఏమియుఁ బ్రయోజనము లేకపోయెను. రాముఁడు లక్ష్మణయుతుఁడై సమస్తారణ్యంబును వెదకెను. ఏదికనఁబడినను జానకి స్వరూ పమే యని భ్రమించి దానిని సమీపించి విఫలమనోరథుం డగుచుండెను. జానకింగూర్చి యాతనికి శోకం బధికం బయ్యెను. చిత్తంబు చంచలించిపోయెను. 'జానకీ! జానకీ! నన్నుఁబాసి యెందరిగితి?' యన్న వాక్యముతప్ప యాతనినోట నుండి మఱియొక మాటయైన రాదయ్యెను. "అయ్యో! జనకరాజతనయా! ఎందుఁ బోయితివి? ఇటు రమ్మా. నిలువుము. నిలువుము. నీ శుభదర్శనం బొసంగుమా. ధైర్య

మాఁపఁజాలను. ఇంకను బరిహాసం బెందాఁక నాడెదవు? దూరపథశ్రమాగతుని నన్నేలగారించెదవు? నీవు నాయండ నుండఁగా దర్భతల్పంబులు నాకు హంసతూలికల పాన్పులయ్యెను. కందమూలంబు లమృతంబులయ్యెను. అరణ్యంబే యయోధ్య యయ్యెను. పర్ణశాలయే దివ్యసౌధమయ్యెను" అని మతిపోయిన మాటల నీ విధంబునఁ బలవింపసాగెను

" ఉ॥ హా యను సీత సీత యను ♦ నక్కట యెక్కడఁబోయి తిందు రా
వే యను నిల్వు నిల్వు మను ♦ నీగతిఁ జేరెద నాదుపల్కు విం
శే యను వేగమో యనఁగ ♦ దే యను నీ శుభదర్శనంబు నీ
వే యను నన్నుఁ బాయఁ జను ♦ నే యను నాదటఁ జూడవే యనున్॥

శా॥ ఏలా చిక్కులఁ బెట్టె దియ్యడవిలో ♦ నేలే నను౦ జేరవే
యేలే జానకి పిల్చినం బలుకవే ♦ యేలే కృపం జూడవే
యేలే తాలిమిఁ బట్టఁజాల సరసం ♦ బెందాఁక నీ వాడెదే
యేలే దూరపథశ్రమాగతుని న ♦ న్నిట్లేల కారించిదే॥ "

అప్పుడు లక్ష్మణుం డగ్రజునిఁ జూచి, "అన్నా, రాఘవా! ఆపత్కాలంబున ధైర్యముఁ బూనవలయును. అజ్ఞునివిధమున నేల శోకించెదవు? సమస్త ప్రదేశములయందును నామె నన్వేషింత" మని పలికెను.

రాముం డాతని వాక్యంబులు విని, "లక్ష్మణా! నీ వాక్యంబుల ననుసరించి నేను శోకంబు విడిచెద. మహాధర్మ చరిత్రుఁడైన మజ్జనకు సత్యంబు పరిపాలింప నేనీ యరణ్యంబులయందు వసించుచుండఁగా నా కాంతయగు జానకి యపహృత యగుచుండినప్పుడు దేవతలెల్ల నూరకుండిరి.

ఏనిట్లు శోకించుచున్నను నాయందుఁ గరుణఁజూడక యున్నా రు. కానిమ్ము. నా జానకినిఁ జూపకున్నచో జతుర్దశ భువనంబులును మద్బాణాగ్నిచే భస్మంబుఁ గావించెద ” నని పలికి శరసంధానము చేయఁబోవు సమయంబునఁ దమ్ముండు, “ అగ్రజా ! శాంతింపుము. లోకేశుండవగు నీవు లోక హితంబుకొఱకు రాక్షసలోకంబును బరిమార్పవచ్చునుగాక. ఒక్కఁ డపరాధముసేసిన భువనత్రయంబును బాధింప నగునా ? ఆ దేవి నెవ్వఁడో యొక మ్రుక్కఁడి రక్కసుం డెత్తుకొని పోయియుండు. వానిజాడ నెమకుద, ” మని పలికి యన్నను శాంతచిత్తునిఁగాఁ జేసెను.

అంతట నిరువురును సీతాన్వేషణోద్యోగముఁ బూని బయలుదేఱిరి. వారు పోవు మార్గంబున నొకచోటఁ బక్షం బులు దెగి పడియున్న జటాయువును జూచి లక్ష్మణుం డన్నను విలోకించి, “ రాఘవేంద్రా ! చూచినావా ? వీఁడొక రక్కసుండు. ఏమియు నెఱుంగనివానివలె విహంగవేషుఁడై పడియున్నాఁడు. వీనిని మదీయ బాణంబులచేఁ దునుమా డెద, ” నని పలికిన, నా పలుకులు జటాయువు విని దీన స్వరముతో, “ రామ లక్ష్మణులారా ! నేను విహంగరూపము దాల్చియున్న రక్కసుండనుగాను. జటాయువను పక్షి నాథుఁడ. మీ తండ్రియగు దశరథున కత్యంత మిత్రుఁడ. మీరు లేనిసమయంబున లంకాపురీశ్వరుండైన రావణుండు జానకిని గొనిపోవుచుండ నామెను విడిపింపఁ దలంచి వానితో యుద్ధంబొనర్చి యిట్లు విగతపక్షుఁడనై తిని. రావణుండామెం

గోని లంక కరిగినాఁడు" అని పలికి వెండియు "రామభద్రా !
నీవు జానకికై చింతింపవలదు. సంగ్రామంబున నా దైత్యు
నిఁ బరిమార్చి జానకిని బొందెదవు. ఇంక నా దేహంబునఁ
బ్రాణంబులుండవు. నీ కరుణా విశేషంబున నేను మోక్ష
మందుదుఁగాక!" యని వచించె. రాముం డాతని విలోకించి,
"విహంగకులనాథా ! నీ ఋణము నే నెన్నఁటికినిఁ దీర్పఁ
జాలను. మాకై యా దానవునితోఁ గయ్యంబొనర్చి యిట్లు
యితివి. మా తండ్రియగు దశరథున కత్యంత మిత్రుండ
వగుటంజేసి నీవు మాకుఁ బితృసముండవు. నీకుఁ బుణ్య
లోకంబు లభించుఁగాక !" యని యాతని శరీరము స్పృశిం
చెను. పిదప కొంతసేపటికి జటాయువు ప్రాణంబుల విడిచెను.

రాముఁడాతని మృతికి మిగులఁ జింతించి యథావిధిగ
నతని కగ్నిసంస్కారంబు లాచరించి, యచ్చోటు విడిచి,
జానకి నన్వేషించుచుఁ బోవునెడ మార్గంబునఁ గబంధుఁడను
రక్కసుని దునిమి వానిచే వాలి సుగ్రీవుల వృత్తాంతము
నెఱింగి, ఋష్యమూకాద్రి కరిగె.

# జానకీదేవి.

## పదునాల్గవ ప్రకరణము.

### * సఖ్యము. *

రామలక్ష్మణు లిరువురును ఋష్యమూకగిరి ప్రాంతంబున నున్న వనంబునఁ జరించుచుండిరి. కార్ముకహస్తులైన వీరిని వాలి తన్నుఁ జంపింప రప్పించెనని సుగ్రీవుఁడు మనంబునఁ దలంచి భయంబంది యా విషయము మంత్రులగు హనుమంతుఁడు మొదలగువారితోఁ జెప్పెను. హనుమంతుఁడు సుగ్రీవునిఁజూచి, ‟వారు వాలి పంపున నిచ్చటికరుదెంచినవారని డెందంబున భయంబందవలదు. వారెవ్వరో మహానుభావులని తోఁచుచున్నది. నేఁగనుఁగొని వచ్చెద,”నని పలికి, మాయాభిక్షుకుఁడై యా రామలక్ష్మణులఁ జేరెను. హనుమంతుఁడు వారికి నమస్కారంబులాచరించి, ప్రియోక్తులు గొన్ని పలికి వారిని విలోకించి, ‟మీరెవ్వరో మహాత్ములవలెఁ గానిపించుచున్నారు. అసమాస్త్ర విద్యావిదులని తోఁచుచున్నది. మిమ్ముఁజూచి కపులందరును నలుదెసలం బరుగులిడుచున్నారు. కాలవ్యాళములఁబోలు కరవాలంబులఁబూని యీ వనంబునకేల యరుదెంచినారు? నరమునివేషంబులందిన నరనారాయణుల పగిదిఁ బ్రకాశించుచున్నారు. సప్తద్వీప సముద్ర సంయుత

మహీచక్రంబు నేలఁదగిన రాజకుమారుల చందంబున వెలుంగుచుండియుఁ దాపసవేషంబుల నేల పూనినారు ?" అని పలికి వెండియుఁ యథార్థముఁ దెలుపనెంచి, "నేను సుగ్రీవుండను ప్లవంగనాథునకు సఖుండ. వాయునందనుఁడ. హనుమంతుఁడనువాఁడ. కామరూపుఁడ. కామగమనుఁడ. సుగ్రీవుండు మీ యుదంతంబు నారసిరమ్మనఁగా వచ్చినాఁడ" నని విన్నవించెను. అప్పుడు రాముండు జానకినిఁ గోల్పోవుటాదిగాఁగల తన వృత్తాంతమంతయు సవిస్తరంబుగాఁ దెలిపెను. లక్ష్మణుం డతనింజూచి, "కపికులవర్యా ! మీ సుగ్రీవుని వృత్తాంతంబు గబంధునివలన విని యిచ్చటికరుదెంచినాము. లోకవంద్యుఁడగు శ్రీరామచంద్రుఁడు నేఁడు నీరజాప్తసుతుని సఖ్యముగోర వచ్చినాఁడు" అని పలికెను. అనంతరము హనుమంతుఁడు రామలక్ష్మణుల నిరువురను వెంటఁబెట్టుకొని, సుగ్రీవునివద్ద కరిగి, యాతనితో నా రాజకుమారుల వృత్తాంతంబంతయుఁ దెలిపెను. అంతకుఁ బూర్వము, రామలక్ష్మణులు తన్నుఁ జంపుటకు వాలి పంపున, నరుదెంచినవారని కడుభయం బొందుచున్న యా సుగ్రీవునకు భయము పోయెను. హనుమంతుఁడు రాజకుమారుల యుదంతంబుఁ దెలిపె. హనుమంతుఁడు చెప్పినంతనే భయంబువాసి సుగ్రీవుఁడు తనకు దొరకిన వస్తుసముదయంబునుఁ దెప్పించి శ్రీరాముని సన్నిధిఁ బెట్టెను. శ్రీరాముండు వానింజూచి, యయ్యవి తనసతియగు సీతాదేవి భూషణ సముదయంబేయని తెలిసికొని విచారిం

చెను. సుగ్రీవుండు రాముని విలోకించి, "రామా! నేను హనుమదాదులతో ఋష్యమూకంబున విహరించుచుండఁగా రావణుండు జానకిని గొనిపోవునప్పుడు జానకి మిగుల దుఃఖించుచు నీ వస్తువుల మూటను మా ముందుఁ బొఱవేసెను. అయ్యది నే నతిజాగరూకతతో దాఁచినాఁడ." అని వెండియు, "రామా! నీ స్వాంతంబునఁ జింత విడువుము. ఆ జానకీదేవి యీ చతుర్దశభువనంబుల యందెచ్చట నున్నను దోడ్కొనివచ్చి నీ పాదసన్నిధిం బెట్టెద" నని పలికెను. అనంతరము సుగ్రీవుఁడు రాముని విలోకించి, "రఘునందనా! వాలి యను నతఁడు నాకగ్రజుండున్నాఁడు. ఆతనికిని నాకును వైరము. అతఁడు నన్ను వధించుటకు నిరంతరమును బ్రయత్నము సేయుచుండు, నన్ను రాజ్యంబునుండి వెడలఁగొట్టి, నా భార్యయగు రుమను గైకొనినాడు. మా యిరువురలో నెవ్వరైన నొక్కరే యుండవలయునని యాతఁడు దీక్షఁబూనియున్నవాఁడు. ఆతని భయంబుచేత నేనీ ఋష్యమూకంబున వసించుచున్నాను. కావున నాయందుఁ గృపాయత్తమతివై నాకు వాలి భయంబును బాపు" మనెను. అప్పుడు రాముఁడు సుగ్రీవుని విలోకించి "సుగ్రీవా! ఉపకారబుద్ధియన నేమో యెఱుంగుదును. వాలి వలన నీవావంతయు భయంబునందఁబనిలేదు. వాలిం గూల్చి నీకు ముదంబుఁ గల్గఁజేసెద. భయంబుడుగు" మని చెప్పెను. అనంతరము రామసుగ్రీవు లిద్దఱు నగ్నిసాక్షిగ స్నేహము గావించుకొనిరి.

# జానకీదేవి.

## పదునైదవ ప్రకరణము.

### * రహస్యవధ. *

సుగ్రీవుండు తనకును వాలికిని నున్న వైరమునకుం గారణంబంతయు సవిస్తరంబుగా శ్రీరామున కెఱింగించి, తన్ను వాలిబాధనుండి రక్షింపుమని వేఁడుకొనెను. దీన జనసంరక్షకుండగు రాముండాతని కభయంబిచ్చెను. కాని, రాముండు బలశాలియగు వాలిని గూలనేయఁగలఁడో లేఁడో యను సంశయము సుగ్రీవుని బాధించుటచేత నాతండు రామునిఁజూచి, ‹‹దేవా ! శ్రీరామచంద్రా! వాలిని వధియిం చెదనని నీవు నా కభయంబిచ్చినావు. అందుకు సంతసమే. కాని నీ బలపరాక్రమంబులు నేనెఱుంగను. మూఢుండను. వనచరుండను గావున విన్నవించుకొనుచున్నాఁడ. మన్నిం పుము. పర్వతసన్నిభుఁడైన దుందుభియను దనుజుఁడొక డిట్యేడకువచ్చి యనివార్యశౌర్యంబునఁ గులాద్రులను బెల్ల గించుచు మమ్ము భయభ్రాంతాత్ములుఁగాఁ జేయుచుండ, వాలి యయ్యది వీక్షించి నిర్వక్రపరాక్రమంబున విజృం

భించి, యీ దుందుభిని దలపడి ఘోరముగఁబోరి, యోజన దూరంబునఁబడి ప్రాణంబులఁబాయునట్లు గాలఁజిమ్మినాఁడు. అదిగో, దుందుభికళేబరంబచ్చటనున్నది. నీవు దానింగాల జిమ్మఁదువేని నీవు తప్పక వాలిం గూల్పఁగల్గుదువని నాకు ధైర్యముండును. మఱియు నచ్చట సప్తతాళంబులున్నవి. వానిని నీవొక్కశరంబున దెగవేయుము. ఈ రెండు కార్యంబులును నీ వొనర్చితివేని నీవు వాలికంటె నెక్కుడు పరాక్రమవంతుఁడవని తలఁచెదను" అనెను. శ్రీరాముఁడు సుగ్రీవుని చిత్తమునకు సంతసము గల్గునట్లు దుందుభి కళేబరమును దన పాదాంగుష్ఠముచేఁ బదియోజనముల దూరమునఁబడునట్లు బారఁజిమ్మి, సప్తతాళముల నొక్కశరమునఁ గూలనేసె. సుగ్రీవుఁడు రాముని బలమున కాశ్చర్యమందెను. అనంతరము, రాముని యాజ్ఞ ననుసరించి, సుగ్రీవుఁడు వాలిని రణమున కాహ్వానించెను. వాలిసుగ్రీవులిద్దఱును రణమునకుఁగడఁగి ఘోరముగ బోరసాగిరి. శ్రీరాముఁడు తప్పక వాలిని గూల్చునను నాసతో సుగ్రీవుఁడు వాలిని రణమునకుఁ బిలిచెను, కాని వాలిసుగ్రీవు లిద్దఱును రూపంబున నొక్కతీరుగ నుండుటచే రాముఁడు వాలిని గుర్తింపనేరక యూరకుండెను. సుగ్రీవుఁడు వాలి ముష్టిప్రహారముల కోర్వజాలక వెనుకకు మరలెను. అంతట రాముఁడు వాలి నప్పుడు కూలనేయకుండుటకుఁ గారణము నెఱింగించెను. రామాజ్ఞచే సుగ్రీవుఁడు తన గళంబున నొక్క పూలహారమును ధరించుకొని మరల వాలిని యుద్ధ

మునకుఁ బిలిచెను. వానిభార్యయగు తారకు సూర్యసుతుండు పన్నిన మాయయంతయుఁ దెలిసియుండెను. అప్పుడామె రణోద్యోగమునహించి పోవనున్న భర్తయగు వాలినిజూచి యిట్లు పలికె. "ప్రాణేశ్వరా! ఇంచుక నిలువుము. నీకొక హితంబుఁ జెప్పెదను. ఇప్పుడు నీవు సుగ్రీవునిపై కరుగుట మానుము. నిన్న నీచేఁ బరాజితుండైన యాతఁడు మరల నేఁడు నిన్ను యుద్ధమునకుఁ బిల్చుటకు గొప్పకారణమేదైన నుండవచ్చును. అంగదునిచే నేనొక్క వార్తవింటిని. ఈ సుగ్రీవుఁ డినకులతిలకుఁడగు శ్రీరామునితో సఖ్యముచేసికొని యాతని సాయమునునమ్మి నీతో రణమునకు మొనయు చున్నాఁడు. ఆ రాముఁడు సామాన్యమానవుఁడుగాఁడు. దేవతలకైనను నజేయుఁడు. ఆ యన్నదమ్ములిరువురుఁ జతుర్దశభువనంబులును నేకమై వచ్చినను వెనుదీయరు. రాముని సఖుఁడయిన యా సుగ్రీవునితో విగ్రహమునూని యాతనినే యువరాజుఁగాఁజేసి యతనిని మన్నింపుము. ఇప్పుడు నీవు మన యింటనున్న మణిమయహారంబులుగైకొని శ్రీరామునకుఁ గానుకవెట్టి సుగ్రీవునితో సంధిచేసికొందునని ప్రార్థింపుము. అతఁడు తప్పక నిన్నాదరించును." తార పల్కిన వాక్యముల కాతఁడు లక్ష్యపెట్టక యామెంగాంచి, "తరుణీ! నీవేల భయమందెదవు. యుద్ధమున కాహ్వానింపఁబడిన నేను వెనుదీసితినేని వీరులు పరిహసింతురు. ఇక్ష్వాకువంశజులు ధర్మాత్ములు. నేను శ్రీరామునకేమియు నపరాధమును చేయలేదు. అతఁడేల నన్ను వధించు," నని

పలికి సుగ్రీవునితో రణము సేయుట కరిగెను. వాలి సుగ్రీవు
లిరువురును రంగస్థలంబునఁ బ్రవేశించి పోరాడసాగిరి. సుగ్రీ
వుఁడు వాలి గదాతాడనములకు సైపఁజాలక శ్రీరాముఁ
డెప్పుడు వాలినిఁ గూల్చునాయని బలదర్పములుడిగి యోజిం
చుచుండెను. అంతకుమున్నే వృక్షముచాటుననున్న శ్రీరా
ముండప్పుడు శరమును సంధించి వాలిపైఁ బ్రయోగించెను.
వాలి నేలఁగూలెను. శ్రీరాముఁడాతని కన్నులకుఁ గానిపిం
చెను. తార పలికిన వాక్యంబులన్నియు సత్యములయ్యెనని
తలంచి, యాతఁడు శ్రీరాముని విలోకించి యనేకవిధము
లయిన దుర్భాషలాడెఁగాని, శ్రీరాముండాతనికిఁ దగువిధం
బునఁ బ్రత్యుత్తర మిచ్చుటచేతఁ బశ్చాత్తప్తహృదయుఁడై,
యాతనిని వేఁడుకొనెను. శ్రీరాముఁడు వాలికై విలపించు
తారాంగదులను నూరడించి, కిష్కింధకు సుగ్రీవుని రాజుఁ
గాను, నంగదుని యువరాజుఁగాను నొనర్చెను.

# జానకీదేవి.

## పదునారవ ప్రకరణము.

* ముద్రిక — సముద్రలంఘనము. *

వర్షాకాలమగుటచేత శ్రీరాముండు లక్ష్మణసమేతుండై కిష్కింధానగరంబునకుం గడుసమీపంబుననున్న యొక గిరిగహ్వరంబున వసించియుండెను. సుగ్రీవుండు శ్రీరామునిచేత రాజుగా జేయంబడినది మొదలు తారతో మోదించుచు నంతఃపురంబును విడిచివచ్చుటయే లేదు. వాలి వధకుం బూర్వము తాను సీతాన్వేషణంబునుగూర్చి తగు ప్రయత్నము సేయుదునని శ్రీరామునితోం జెప్పిన మాటలు మఱచియుండెను. అతఁడా ప్రయత్న మొక్కింతయుం జేయుచుండుటలేదు. హేమంతఋతువు ప్రవేశించెను. వర్షబాధ యడంగిపోయెను. "ఎప్పుడు వర్షకాలము పోవునా? ఎప్పుడు సుగ్రీవుఁడు జానకి జాడల నరయుటకుం గపులను బంపునా? ఎప్పుడు జానకినిం గన్నుల కఱవుదీఱం జూడంగల్గుదునా" యని దినంబొక యుగంబుగాం గడపుచున్న శ్రీరాముఁడు, సుగ్రీవుఁడు తన్నుణునిం బిలిచి యిట్లుదున మనంబున ననుమానమంది లక్ష్మం జూచుటకు రానం

వలికె. "లక్ష్మణా! వర్షాకాలమరిగినంతనే సుగ్రీవుండు సీతాన్వేషణంబునకై నలుదిక్కులకును గపులను బంపెదనని వచియించియున్నాఁడు. అతఁడు నేఁటివఱకును మనకడ కరుదెంచియుండలేదు. రాజ్యాభిషిక్తుండైన యాతఁడు మదోన్మత్తుండై తారం గూడియుండి మనతో నన్నమాట మఱచియుండును. కావున నీ విప్పుడాతనికడకరిగి నా వచనంబులుగా నిట్లు వక్కాణింపుము. "ఓయీ! సుగ్రీవా! ప్రమత్తునకుఁ బ్రత్యుపకారచింతనము గలుగదు. నీవు నాతో నన్నమాటనుమఱచి భోగాసక్తచిత్తుండవై యున్నాఁడవు. ఇప్పుడైనను నీవు సీతాన్వేషణంబునఁ గడుశ్రద్ధ వహింపవేని వాలియున్నకడకుఁ నిన్నును జేర్చెద."

లక్ష్మణుం డగ్రజుని వాక్యంబులు విని శరశరాసనపాణియై సుగ్రీవుని యంతికంబునకు బయలువెడలెను. ఈతని రాక హనుమంతుఁడు చూచెను. రూక్షేక్షణతీక్ష్ణంబైన లక్ష్మణుని ముఖంబు వీక్షించినంతనే హనుమంతుఁడు సర్వము నెఱింగి సుగ్రీవుని యంతఃపురంబును బ్రవేశించి యతనిం గాంచి, "సుగ్రీవా! నీవు స్త్రీలోలుఁడవై రామ కృతోపకారంబును మఱచియున్నాఁడవు. నీవు రాజవైతివని గర్వింపకుము. మిత్రద్రోహులు నరకములపాలగుదురు. భోగాసక్తుఁడవై రామకార్యంబును మఱచితివి. ఆతఁడాగ్రహింపకమున్నే మేల్కొనుము. నీ వాలస్యముచేసితివని కాఁబోలు దండతాడిత మహోరగంబుకరణి మండిపడుచు సౌమిత్రి యిట్లు వచ్చుచున్నాఁడు. ముందుగా నాతని శాంతచిత్తునిఁ

జేసి యనంతరము శ్రీరామసన్నిధి కేఁగుదమురమ్ము" అని చెప్పెను. సుగ్రీవుండు వెంటనే హనుమత్సమేతుండై బయలుదేఱి లక్ష్మణున కెదురేగి యాతనిని మన్నింప వేఁడుకొనెను. ముగ్గురునుఁగలసి శ్రీరాముని సన్నిధి కేఁగిరి. సుగ్రీవుఁడు శ్రీరామునకు నమస్కరించి యాతనికి ముదంబు గలుగునట్లు భాషించెను. ఆయా స్థలంబులనున్నట్టి వానరుల నందఱను సుగ్రీవుఁడు రప్పించెను. అనేక వానరవీరులు జానకిజాడలనరయుటకై యనేక స్థలంబులకుఁ బంపఁబడిరి. శ్రీరామునకు హనుమంతునిపై నొకతీరయిన కరుణజనించెను. జానకిజాడల నాతఁడు తప్పక యెఱింగివచ్చునని తోఁచెను. అతఁడు మహాపురుషుండనియుఁ దనకార్యమాతనివలన నెఱవేఱుననియు, నతని హృదయంబునకుఁ బొడకట్టెను. అంతట రాముఁడు హనుమంతునిఁజూచి, "హనుమా! కార్యసిద్ధికీవు ముఖ్యుండవు. ఈవు దక్షిణంబున కేఁగుము. నీవు తప్పక జానకిసేమంబు వినిపింపఁ గలవని నాకు శుభసూచన లగపడుచున్నవి. ఆ కారణంబునం జేసి నేను ధరించునట్టి యీ కనకాంగుళీయకము నీ చేతి కొసంగుచున్నాఁడ. నీవు జానకికియ్యది యానవాలుగా నొసంగు" మని పలికి చేతనున్న యుంగరంబునుదీసి యాతని చేతికొసంగెను. అంగుళీయకము వాయుజుని హస్తంబునఁ బడినంతనే యాతనియందొక యపూర్వతేజమావహించినది. అదివఱకులేని బలము, శౌర్యము, సాహసము, ధైర్యము, ప్రతాపము మొదలగునవి గలిగెను.

హనుమంతుండుంగరంబును భద్రపఱచుకొని శ్రీరామునకు నమస్కరించి యంగద జాంబవదాది వానరవీరులు వెంటరా దక్షిణదిక్కుం గూర్చి చనెను. అట్లరిగిన యా వానరులు సకల ప్రదేశంబులయందును జానకిని వెదకిరిగాని వారి శ్రమయంతయు వ్యర్థమయ్యెను. ఆ సమయంబున నంగదుని మేనమామయగు తారుఁడు తక్కిన వానరులం దిలకించి, "హితులారా! జానకిజాడల నరయకుండ మనము సుగ్రీవుని ముఖంబెట్లు చూడఁగలము? ఆజ్ఞోల్లంఘనమున కాతఁడు మనకు మరణదండనమే విధించును. బలవన్మరణమునందుదమన్నఁ బ్రాణములపై నాస వీడకున్నది. కావున మయనిర్మితమైన యీ గుహయందాయుశ్శేషము గడపుట మంచిదని తోఁచుచున్నది. అన్నకుమారుండనియైన నంగదుని సుగ్రీవుఁడు కరుణింపఁడు. వనచారులమగు మనకు శ్రీరామునితోఁ బనియేమున్న" దని పలికెను. అంగదుండు వానిమాటల నాలించి యనుచరులంగాంచి యిట్లు పలికె. "ఆజ్ఞనుల్లంఘించినవారిని దండించుటకు నృపునకు ధర్మమైయున్నదిగాని, సుగ్రీవుండు యుక్తాయుక్త విచారణ శూన్యుండగుటచేత మనకుఁ దారుండు చెప్పినట్లు మరణదండనమే విధించును. రాజ్యకాంక్షంజేసి, మా తండ్రియు, నతని కగ్రజుండును నగు వాలిని రామునిచేతఁ జంపించినాఁడు. అట్టివాఁడు మనయెడల దయాకలితాంతరంగుండై వర్తించునా? అతనిచే మృతినందుటకన్న బిలప్రవిష్టులమై యుండుటయే మంచిది. నేనుమాత్రము

గిష్కింధకు రాఁజాలను." జాంబవంతుండు నందుకు సమ్మతించినట్లే కనఁబడెను. వారి మాటల నాలించి హనుమంతుండు చివాట్లుపెట్టి వారి యుద్యమంబును వారించెను. హనుమదుపదిష్టమార్గమున వానరులు మహేంద్రగిరినెక్కి సాగరము నవలోకించి భయపడి ప్రాయోపవిష్టులై శ్రీరామ సంకీర్తనంబు సేయఁదొడంగిరి.

జటాయువునకు సంపాతియనువాఁడగ్రజుండు. ఈతఁడు జవపరీక్షకై భానుమండలమునకేఁగి సూర్యకరసంతప్తపక్షుఁడై మహేంద్రగిరి శిఖరోపరిభాగమునఁ బడియుండెను. వానరులొనరించుచున్న రామకథాకథనము వినుటవలనఁ దొంటియట్ల సంపాతికిఁ బక్షము లుత్పన్నములయ్యె. భ్రాతృమరణంబునకు జెందంబునఁ గుందుచు నా సంపాతి వానరులం జేరెను. ఆతనివలన వానరులు జానకి లంకాపట్టణంబుననున్నదని యెఱింగిరి. అప్పుడు వానరులు పొందిన యానందంబునకు మేరలేదు. ఇఁక సాగరమునుదాఁటి లంకం బ్రవేశించి యెవ్వరామెనీక్షించి వత్తురని యాలోచింపసాగిరి. గజగవాక్షగంధమాదనమైందద్వివిదాదివానరులెనుబది యోజనములవఱకును సాగరంబును దాఁటుదుమని నుడివిరి. మేరుపర్వత శృంగాభిఘాతమువలన జాంబవంతునకు బలము హీనమయ్యెను. "తొంబది యోజనములు దాఁటగలను. త్రికూటాచలమిచ్చటికి శతయోజనంబులదూరమున నున్నదనియు, మార్గమధ్యమున ననేక విఘ్నభయములు గలవనియు, సంపాతి చెప్పియున్నాఁడు. ఒకవేళ నెట్లయినను నేను

దాఁటగల్గినచోఁ బునర్భాగమనమునకు నాకు శక్తి చాలదు. హనుమంతునికంటె నన్యులకీమహాకార్య మసాధ్యము" అని జాంబవంతుఁడు పలికి వెండియు హనుమంతునిఁజూచి, "వాయుజా! మా బలములు విదితమయ్యెనుగదా? శ్రీరామానుగ్రహమునకీవు ముఖ్యముగాఁ బాత్రుఁడ" వని పురి కొల్పెను. హనుమంతుఁడు వారింజూచి "అపారంబగు సంసారాంభోధికిఁ దరణసాధనము శ్రీరామనామసంస్మరణమే. రామానుగ్రహపాత్రుఁడనై నే నత్యల్పమగు సాగరంబును దాఁటి లంకం బ్రవేశించి జానకి జాడల నెఱింగి మఱల నేతెంచుట యాశ్చర్యముకాదు. రామనామంబు జపించుచు మీరందఱు నిచ్చోట సుఖంబుగా నుండుఁడు. నే నరిగి వచ్చెద," నని సంతోషంబునఁ బలికెను. జాంబవదాదులు సంతసించిరి. అంతట హనుమంతుఁడు హృదయంబున శ్రీరామునకు నమస్కరించి పర్వతాగ్రభాగంబునుండి కుప్పించి యెగసి సాగరోపరిభాగమునకు దుమికిపోవనారంభించెను. పాదసంఘట్టనంబునఁ దరుగుల్మలతాదులు స్వస్థానములవీడి సముద్రముఁజేరి కొంతదవ్వేగెను. పవనవేగమున సాగరంబంతయు నల్లకల్లోలంబయ్యె. సముద్రాంతర్భాగమునుండి మైనాకుఁడు సువర్ణశృంగములతో బయలువెడలి హనుమంతునకు నమస్కరించి, "పర్వతపక్షచ్ఛేదన కాలమున నీ జనకుఁడు ననుఁగాచి రక్షించెను. శ్రమాపనయార్థము క్షణకాలము నిలువు" మని విన్నవించి యర్ఘ్యపాద్య ఫలంబుల నర్పించెను. "సీతాన్వేషణకార్యభారంబు వహించి,

ప్లవనైకవ్యాపారంబుననున్న నాకు విశ్రమాపేక్ష కలుగు టెట్లు? నీ యాతిథ్యంబునకు సంతసించితిని. జాగుసేయం దగదు. పోయివచ్చెద," నని హనుమంతుండు చెప్పి యచ్చోటువాసిపోవుచు నిజబలపరీక్షకై దేవతలు పుత్తెంచిన సురసనోడించి, ఛాయాగ్రాహిణియైవచ్చిన సింహికను బరిమార్చి, సూర్యాస్తమయ సమయంబునకు సంకుచిత రూపంబుతో లంకాపురంబుఁ బ్రవేశించెను.



# జానకీదేవి.

## పదునేడవ ప్రకరణము.

### * అంతఃపుర పరీక్ష. *

నిశాసమయంబున హనుమంతుండు లంకాపుర సింహద్వారంబు సమీపించెను. అతఁడు పురంబుఁ బ్రవేశించుచుండఁగా లంకాపురంబునుగాచు లంకిణియను నిశాటి ఘోరరూపంబున నాతని నడ్డగించెను. హనుమంతుండొక్కింతయు భీతిల్లక గంభీరరూపంబుదాల్చి నిశాటిగర్వమడఁగించెను. వానరుచే నారక్కసి గొట్టఁబడినప్పుడు దైత్యకుల వినాశంబు ప్రారంభమగునని యాలంకిణి యెఱింగినది గావున హనుమంతుని యథేచ్ఛముగాఁ బురంబులోఁ జరింపుమని వచించెను. అంతట నాతండు పురప్రవేశంబొనరించి దుర్గస్థానంబులను, గోశాగారంబులను, నాయుధశాలలను నుద్యానవనంబులను, విభీషణ కుంభకర్ణుల సౌధంబులను, బ్రహస్తాది మంత్రివర్యుల మందిరంబులను బరీక్షించి చూచెను. ఎందును జానకి కానిపించలేదు. అనంతరమా

తేఁడు సప్తప్రాకార పరివృతమై పురంబుననున్న సౌధంబుల యందెల్ల నగ్రగణ్యమైయున్న దివ్యసౌధంబొండు పొడగాంచి యది యే రావణుని మందిరంబని తలంచి సంకుచిత రూపంబుతో నందుఁ బ్రవేశించెను. ఆ మందిరంబున నా యర్ధనిశనందందు రాక్షసాంగనలు సురాపాన మత్తచిత్తులై పతులంగలసి కొందఱు, నొంటిగాఁగొందఱును, వివస్త్రలై కొందఱును శయనించియుండుట యాతఁడుచూచి తన మనంబున, "హా! బ్రహ్మచారినగు నే నివియన్నియుఁ జూచితిని. దీనంజేసి నాకేమి పాపంబుగలుగునో" యని చింతించి, తుదకు "శ్రీరామానుగ్రహపాత్రుండనగు నాకుఁ బాపంబు గలుగకుండుఁగాక" యని ధైర్యము దెచ్చుకొని, రావణుని యంతఃపురంబుఁ బ్రవేశించెను. దశకంఠుడు మండోదరీ సహితుండై హంసతూలికాతల్పంబున శయనించి యుండెను. ఆతని ప్రక్కనున్న మండోదరిసిజూచి యా సుందరి జానకియని తలంచి హనుమంతుఁడు మఱల తన మనంబున, "అక్కటా! నే నెంతపాపము తలంచితిని. జగన్మాతయు, నిందిరావతారయునగు జానకి దానవుని శయ్యనుండునా? శ్రీరాముని బాసి యిట్లు భూషణంబుల ధరించుకొనునా? పాపము శమించుఁగాక" యని తలంచెను. రావణుని సౌధంబంతయు నతఁడు జానకికై యన్వేషించెను. ఎచ్చటను గానిపించలేదు. జానకిని గనుఁగొనలేకపోయి నందుకుఁ దన మనంబున నిట్లు విచారించెను. "ఈ లంకాపురంబున జానకియున్నదని సంపాతి చెప్పియున్నాఁడు. ఆ

పలుకు మిథ్యయయ్యె. రావణుండామెను రథముపై బెట్టి తెచ్చునప్పుడావేగంబునకుఁ దాళఁజాలక యా సాధ్వి సముద్రంబునఁ బడెనేమో? రామునిఁ బాసియుండలేక ప్రాణంబులు వాసెనేమో? అట్లుగానిచో రావణుండెక్కడనైన రహస్యంబుగ దాఁచెనేమో? ఎంత వెతకినను గానిపింపకున్నది. జానకిని గనుఁగొనక కిష్కింధకు నేనెట్లు పోవుదును? జానకిజాడలు దెలియలేదని రాముండు ప్రాణంబులు విడుచును. అతని మృతింగని సౌమిత్రి మరణంబునందును. అన్నదమ్ముల మరణమాలించి భరతశత్రుఘ్నులును, కొడుకులందఱును మడియుటచే దల్లులును ప్రాణంబులు విడుతురు. రామమరణంబుఁజూచి సుగ్రీవుండును, నతనింజూచి రుమయు, దారయు నంగదుండును జీవంబులు విడుతురు. అంతట వానరులు తమతమ మార్గంబులను జూచుకొందురు. నే నిప్పుడు కిష్కింధకుఁబోవుదునేని భానుకుల నాశనంబునుఁ, గపికులనాశనంబును దెచ్చినవాడనగుదును. కావున కిష్కింధకేఁగుట మానెద".

అని యిట్లనేక విధంబులఁదలంచి తుదకు ధైర్యము దెచ్చుకొని తెల్లవాఱుచుండుట మెఱింగి కన్నులయెదుట నొక యశోకవనంబునుంగాంచి జానకియందుండునేమోయని యందరయుటకై చనెను.



# జానకీదేవి.

## పదునెనిమిదవ ప్రకరణము.

### * సంతోషము — శిరోమణి. *

"అక్కటా! నేనిచ్చటికివచ్చి పెక్కుమాసములయినది. ఇంతవఱకు నా నాథుండు నన్నుఁ దోడ్కొనిపోవుటకు రాలేదు. నా జాడ యాతనికి దెలిసినదో లేదో? నా బ్రతుకు సింగంబునకుఁ జిక్కిన కురంగంబు చందంబయ్యెను గదా! తల్లికంటెను నెక్కుడుఁగాఁ జూచు నో కౌసల్యామహాదేవీ! నిరంతరంబునుఁ బ్రేమతోఁ జూచు సుమిత్రా! నన్నుఁ దల్లిగా నరసెడి యోలక్ష్మణా! మీ రెందున్నారు. హా! రామచంద్రా! నీవుతప్ప నాకితరదైవంబు లేఁడని నమ్మియున్నాను. నీ చరణదాస్య మెప్పటికైన మఱలఁ గల్గునను ధైర్యముతో మేనం బ్రాణంబుల దాల్చియున్నాను. అయ్యో! దీనురాలిని రక్షింపరమ్ము" అని పరిపరివిధంబుల నా యశోకవనంబున నొక వృక్షంబుక్రింద నాసీనయై, దనుజభామినీ పరివేష్టితయై జానకి శోకించుచుండెను. అప్పుడు హనుమంతుండు సామాన్య వానరరూపంబున నావనంబుఁ బ్రవేశించి

యీామెంగాంచెను. ఆమె కృశించి జీర్ణమై మాసినచేలంబుధరించి ధైర్యమింతయైననులేని చిత్తముతో నవయుచుండెను. హనుమంతుండామెను మిగులఁ బరీక్షించి చూచెను. రావణుండామెను గొనివచ్చినప్పుడు భూషణంబులు మూటఁగట్టిన వస్త్రమును నిప్పుడామె ధరించిన చేలంబును నొక్కటిగనే యుండెను. రాముఁడు చెప్పిన యానవాళ్లన్నియు నామె యందుఁ బొడకట్టెను. వేయేల? హనుమంతుండామెయే జానకి యని కృతనిశ్చయుండై, "సంతోషము. సంతోషము. ధన్యుఁడనైనాఁడ. ధన్యుఁడనైనాఁడ" నని పలుమాఱనుకొనెను. అంతట నాతండామెం దర్శించి సంభాషించుటకై తలంచుచుండఁగా భయంకరారావంబులు వినవచ్చెను. అది యేమైయుండునో యని పావని యాలోచించుచుండఁగా రావణుం డచ్చటికి నచ్చుచున్నజాడ గానఁబడెను. హనుమంతుండచ్చటనున్న వృక్షంబునెక్కి కొమ్మలమధ్యమందాసీనుండై యుండె. అప్పుడు ధాన్యమాలినియను దనుజభామిని తన వెంటరా రావణుండు జానకి యున్నయెడకరిగి మోహాంధుఁడై యనేక దుర్భాషలాడెను. కర్ణకఠోరంబులగు నాతని పలుకు లాలించి సాధ్వీశిరోమణి యగు జానకి దుష్టదానవుని విలోకించి యిట్లు పలికె. "దైత్యేశ్వరా! నాపైఁ జిత్తముఁజేర్చుట నీకుఁ దగదు. నీ పడంతులయందుఁ జిత్తముఁజేర్చి సుఖింపుము. సాక్షాద్విష్ణుస్వరూపుండగు శ్రీరామభార్యనైన నన్ను వాంఛించుట ధర్మముగాదు. మహాపుణ్యవంతుండవగు నీకెవ్వతెనను నీపురం

బున బుద్ధులు చెప్పువారు లేరయిరి కాఁబోలు! పరోటి కాపాటయనునట్లు నీ కూఁతుదిని బ్రతుకు దుశ్శీలురు నీవు చేసెడి ప్రతికార్యంబును బాగుగ నేయున్నదని పలుకుచుం దురు. ఇంకను నీవు కొన్నాళ్ళు జీవంబుదాల్చి యీ పురం బేలఁదలంచినవాఁడవేని నన్ను నా ప్రాణేశ్వరున కప్పగించి యాతని శరణంబునంది బ్రతుకుము."

ఈ పలుకులకు రావణుండాగ్రహించి యామెఁ జం పుదునని బెదరించి తీవ్రదృష్టితోఁ జూచెను. "ఓరీ! దుర్మదాంధా! నీ బెదరింపునకు భీతిల్లుదాననుగాను. తీవ్ర దృష్టితోఁజూచు నీ నేత్రంబులూడి నేలఁబడనున్నవి. ఇట్టి సంభాషణమాచరించు నీ నాలుక చీలికలుగానున్నదికదరా? నిన్నును నీ కులంబును, నీ దైత్యులను, నేనే దహింపజేయఁ గలుగుదునుగాని మన్నాథుని యాజ్ఞ లేకపోవుటంజేసి బ్రతికి పోయితివి. ఆనాఁడు నన్ను మాయచేతఁ దెచ్చితివి కాని, యొక్క త్రుటికాలమక్కడనున్నచో రామబాణ ప్రభావము నీకుఁ దెలిసియుండును. రామలక్ష్మణులయెదుట నిలుచుటకు నీవెంతవాఁడవు. పర్జన్యుఁడునిడుచు పిడుగులచందంబున శేషు రామలక్ష్మణులు బాణంబులువిడిచి లంకాపురంబు నంభోరాశిలో ముంచునప్పుడే యను వారి పరాక్రమంబు దెలి యకయుందునా," అని జానకి నిర్భయంబుగాఁ బలికెను. అప్పటికి రావణుండచ్చోటువాసి చనెను. రాక్షసాంగన లందఱును దమతమ గృహంబులకరిగిరి. వృక్షాగ్రమున నున్న హనుమంతుండు జానకిని సందర్శించుటకదియే మంచి

తరుణమని తలంచెను. "ఆహా! విధాత వ్రాతెవ్వండును దప్పింపఁజాలఁడు గదా? ఆయోనిజయై మహాసాధ్వియని ఖ్యాతివడసినది. రాజర్షియగు జనకునకుఁ గూఁతురై వెలసినది. నిరంతర ధర్మవ్రతాచారపారీణుఁడైన దశరథునకుఁ బెద్దకోడలై యొప్పినది. శ్రీమన్నారాయణావతారుఁడగు శ్రీరామచంద్రునకు దేవియై యొప్పినది. అట్టి యీ జానకి దైత్యునకుఁజిక్కి కాలవశంబున నిట్టులున్నదిగదా! ఈమె కొఱకేగదా శ్రీరాముండు విరాధుని జంపుటయు, ఖరదూషణులఁ గూల్చుటయుఁ, గబంధు రూపుమాపుటయు, వాలిని దూలించుటయు సంభవించినది" అని యాతఁడామె దుస్థితిం గూర్చి విచారించుచు, నామెం జూడఁగలిగినందుకు మాత్రము మహాసంతోషము బొందుచు వృక్షము దిగివచ్చి యామె యెదుటనిలిచి శ్రీరామనామసంకీర్తనం బొనరించెను. ఇంతకుముందు దైత్యవనితల క్రూర సంభాషణంబులు విని యున్న యా జానకికీతనిపలుకులు కర్ణరసాయనంబుగ నుండెను. కాని వానరుండగు నీతనింజూచి యిదియేదైన దైత్యమాయయైయుండునేమోయని భయంబందసాగెను. హనుమంతుం డామెముందు నిలిచి యామె యెవ్వారైనదియు నామెవలననే వినఁదలంచి, యిటులనియెను.

క॥ చిరపుణ్య! నీవు మలినాం, బర మిట్టులు గట్టిచాలఁ ◆ బరితాపముతోఁ
దరుశాఖాలంబిని వై, పొరిఁబొరిఁ గన్నీరు దొరఁగఁ ◆ బొగిలెదవేలా ॥

క॥ సురకామినివో విద్యా, ధరవరపర్ణినివో రుద్రి ◆ తరుణివో వనసుం
దరివో మునిపత్నివో కి, న్నరకాంతవో యక్షసతివో ◆ నాగాంగనవో ॥

కం॥ దివిఁజంద్రుఁబాసివసుమతి, కవిరళమతివచ్చియున్న ♦ యారోహిణివో
యవమానమొంది రోషము, న వసిష్ఠుం బాసివచ్చి ♦ న యరుంధతివో॥

కం॥ వినుతశుభలక్షణంబులు, గనుఁగొన నృపమహిషి వీవు ♦ గానోపుదువం
చన దశకంఠుఁడు గొనివ, చ్చిన రాఘవుపత్నివైన ♦ సీతవొ చెపుమా॥

అని పలుక నామె భయంబునందుచు తన నిజమైన యుదంతంబు నిటులఁ దెలిపెను.

కం॥ అన విని జానకి పావనిఁ, గనుఁగొని నా పేరుసీత ♦ ఘనపుణ్యుండౌ
జనకునికూఁతుర దశరథ, జనపతికోడలను రామ ♦ చంద్రునిభార్యన్॥

ఆమె జానకినని చెప్పిన మాటలు విని హనుమంతుం డందిన సంతోషంబునకు మేరలేదు. తానుపడిన శ్రమ లన్నియు సఫలములైనవని సంతోషించెను. హనుమంతుం డామెకు సాష్టాంగ నమస్కారములాచరించి యిట్లనెను. "తల్లీ! నీవు నన్నుఁజూచి భయమందవలదు. నేను శ్రీరామునిదూతనై నీ సేమంబు నరయుటకై యిట్లు వచ్చి నాఁడను. వాయుసూనుఁడను. హనుమదభిధానుఁడ. జననీ! పర్ణశాలయందు నిన్నుఁగానక రాముండు పరిపరి విధంబులఁ జింతించుచు సౌమిత్రిసమేతుఁడై కిష్కింధాపురం బునకువచ్చి సుగ్రీవుండను వానరనాయకునితో మైత్రి చేసి కొని యతని యగ్రజుండగు వాలిం గూలనేసె. యుష్మదన్వేషణార్థమై నేనును మఱియుఁగొందఱు కపులును బయలు దేఱి వచ్చినారము. వారందఱును సముద్రంబున కవ్వలి తీరంబున నున్నవారు. శతయోజనాయతమైన యీ వార్ధిని లంఘించి నేనుమాత్రమీలంకఁ బ్రవేశించి రాత్రియంతయు

సమస్త ప్రదేశంబులయందును నీకై యరసి, తుదకిచ్చోట నినుఁ గంటిని. తల్లీ ! ఇంక నీవు చింతింపకుము. రాముం డిచ్చటికి సత్వరంబుగనే యరుదెంచి రావణుని పుత్రమాత్య భృత్యాదివర్గంబులతోఁగూడఁ దునిమి నిన్నుఁ దోడ్కొని పోఁగలఁడు. ఇదిగో ! శ్రీరామమూర్తి నీ కొసంగిన యానవాలు" అని చెప్పి రాముండొసంగిన కనకాంగుళీయ కము జానకి చేతులయందుఁ బెట్టెను. అంగుళీయకంబు నందుకొని కన్నులనద్దుకొని జానకి శ్రీరాముండు తన యెదు టికివచ్చినట్లు తలంచి యానందసాగరంబున నోలలాడెను. జానకి హనుమంతుని రామసౌమిత్రుల సేమంబునుగూర్చి యడిగి తన కష్టంబులన్నియుఁ జెప్పుకొనెను. అతఁడామెకుఁ దగువిధంబున ధైర్యముచెప్పి "తల్లీ ! నాపుణ్యము సామాన్య మైనదిగాదు, శ్రీరామానుగ్రహంబున నీ హనుమంతుఁడే జానకిజాడల నరసివచ్చెనను కీర్తి నాకబ్బినది. నేనింకనరిగి వానరసేనాసమేతంబుగా శ్రీరామలక్ష్మణుల నిచ్చటికిఁ దోడ్కొని వచ్చెద. అంతదనుక నీవిచ్చట నుండుటకు సహింపఁజాలవేని నా వీపున నెక్కిరమ్ము. నిమేషకాలం బులో సాగరంబును దాఁటించి శ్రీరాముని సన్నిధి నుంచెద. ఎట్లుదీసికొనిపోఁగలుగుదునని నీవు సంశయింపఁబనిలేదు. ఈ లంకాపురంబంతయు నా వాలంబునకుఁ జుట్టుకొని పోఁగల సామర్థ్యము నాకున్నది" యని పలికెను. హనుమం తుండు చెప్పిన దానికామె సమ్మతింపలేదు. ఆమె వాయు నందనునిఁజూచి, "హనుమా ! నీకంత సామర్థ్యమున్నదని

నేను నమ్మఁదును. వాయువేగతుల్యమగు నీజవంబునకోర్వలేక భీతిఁజెంది యబ్ధిలోఁ బడుదునేమోయని భయంబు గలుగుచున్నది. అది యట్లుండ నన్నుఁ గొనిపోవుచుండుట రాక్షసులెఱింగి దైత్యనాథునకుం దెల్పిరేని యాతండు రక్కసిమూఁక నీపైకిఁ బంపును. అప్పుడు నీకును వారికినిఁ బోరాటంబు సంభవించును. సంగరంబున జయాపజయంబులు దైవాధీనములు. వారే గెల్చినచో నీ శ్రమయంతయు వ్యర్థమగును. పోనిమ్ము. రాక్షసాళిం గెలువ నీవొకండవే చాలుదువుగాక. అట్లయినచో శ్రీరామకీర్తి తఱుగదా? రాముండు సంగ్రామంబున రావణునిఁగూల్చి నన్నుఁ గొనిపోవుట సముచితకృత్యము. కావున నీవేఁగి భూమిజసేమంబున నున్నదని తెల్పి లక్ష్మణయుక్తంబుగ మన్నాథునిచ్చటికిఁ దోడితెచ్చి నా పరితాపంబార్పుము." అని చెప్పి శ్రీరామున కానవాలుగా తన శిరోమణి నొసంగెను. హనుమంతుండామె వాక్యంబులకు సంతసించి సమ్మతించి శిరోమణి నందుకొని యామెకు నమస్కరించి యనుజ్ఞవడసి యచ్చోటు వాసి చనెను.

# జానకీదేవి.

## పందొమ్మిదవ ప్రకరణము.

### * బంధనము — విజృంభణము. *

హనుమంతుఁడు జానకీమహాదేవివలన నాజ్ఞఁబొంది వచ్చి, లంకాపురంబునంగల రాక్షసవీరుల బలపరాక్రమంబులు పరీక్షింపవలెనని తలంచెను. అందుకొఱకాతఁడు రావణుండు విహరించు నుద్యానవనంబుఁ బ్రవేశించి యందు ఫలంబులను గడుపునిండ భక్షించి యిచ్చవచ్చినయట్లు వృక్షంబులను బాడుసేయఁ దొడంగెను. వనపాలకు లది గాంచి సామాన్య వానరమని బెదరించిరి గాని దానికి హనుమంతుండు వెఱవక యథేచ్ఛముగా నా వనంబంతయు ధ్వంసంబు గావించెను. వనపాలకులాతని నెదిరించి మడిసిరి. చావఁగా మిగిలిన వనపాలకుఁడొక్కఁడు గడురయంబునఁ బరుగువెట్టిపోయి, యావార్త రావణున కెఱింగించెను. "వానరంబేమి? వనంబు ధ్వంసంబుగావించి తత్పాలకులగు దైత్యుల నుక్కడగించుటేమి?" యని యాశ్చర్యమొంది తన కుమారుండగు నక్షుని, 'వానరునిఁబట్టితె' మ్మని

పంపెను. అక్షకుమారుని రాకఁగాంచి హనుమంతుండు గంభీరరూపంబుఁదాల్చి యొక్కింతయు వెనుదీయక వానిం దాకి యంతకుని ప్రోలికిఁ బంపెను. తదుపరి జంబుమాలి ప్రముఖులైన రాక్షసవీరులనేకానీకంబులతోడం బోయి పొలిసిరి. అనంతరము రావణుండు తన ప్రియపుత్త్రుండగు నింద్రజిత్తును రావించి సమరమునకుఁ బురికొల్పి విజయశ్రీఁ గైకొనుమనిపుచ్చఁగా వచ్చి వానరుఁడీకొనెను. శరప్రయోగ మతిఘోరముగ జేసెను. వానరవీరునిపై నింద్రజిత్తు ప్రయోగించుచున్న యస్త్రంబులన్నియు వ్యర్థమగుచుండెను. అప్పుడు రావణి బ్రహ్మాస్త్రంబుఁ బ్రయోగించెను. బ్రహ్మాస్త్రము సన్మానింపఁదగుననియు, రావణునిఁ జూచి ముచ్చటింపవచ్చుననియు, హనుమంతుఁడు బ్రహ్మాస్త్రంబునకు లోఁబడినట్లు నటించెను. ఇంద్రజిత్తు హనుమంతుని బంధించి రావణుని సన్నిధికిం గొనిపోయెను. రావణునిఁజూచి హనుమంతుండాతని రూపంబునకును, దర్పంబునకును మనంబున నాశ్చర్యము నొంది యీతఁడిట్టి దుష్కార్యంబులు సేయక ధర్మపరుఁడై యుండెనేని దేవేంద్రపదవినైనఁ నందుట కర్హుండగునుగదాయని తలంచెను. దైత్యులు హనుమంతుని రావణుని ముందలనిలిపిరి. రావణుండాంజనేయునిఁ దిలకించి « ఓరీ, నీవెవ్వఁడవు, ఎందుండి యిచ్చోటికి వచ్చితివి. సముద్రమేరీతి దాఁటితివి, వనభంగమేల కావించితివి. రక్కసులనేల యుక్కడఁగించితివి ? » అని యడిగెను. హనుమంతుఁడిట్లు ప్రత్యుత్తరంబిచ్చెను. « దైత్యేశ్వరా !

నేను వాయుసూనుఁడను, హనుమదాఖ్యుఁడను, నిన్నుఁ చతుస్సముద్రములయందును ముంచిన వాలి నొక్కకోలం గూలనేసిన శ్రీరామునకు దూతను. సుగ్రీవుని సఖుండ, సీతాన్వేషణంబునకై నేనీ లంకాపురంబుఁ బ్రవేశించి, నిసి యందు సమస్త ప్రదేశంబులయందును నామెకై యరసి తుదకామె నశోకవనంబునఁ గాంచి శ్రీరామచంద్రుండొసంగిన ముద్రిక నామెకు సమర్పించితిని. నిన్నుఁజూచి సంభాషించుట తటస్థించునని తలంచి వనభంగ మొనర్చితిని. నన్నుఁదాకిన రాక్షసవీరుల నాజి నిగ్రహించితిని. నిన్నుఁ దిలకించుటకే యింద్రజిత్తుచే బద్ధుఁడనైతిఁగాని, లేకున్నచో నన్నుఁ బట్టుట కెవ్వరికినిఁ దరముగాదు.” హనుమంతుని వాక్యంబులువిని రావణుండద్భుతపడి యాతనిపైఁ గోపదృష్టుల నిగిడ్చెను. “ఓయీ! రావణా! నీబల ప్రతాపంబుల కెవ్వరును భీతిఁజెందరు. నీవు జానకిని వంచించి తెచ్చితివి. ఇయ్యది కులక్షయకరమగు కార్యము. రాముఁడన సామాన్య నరుఁడు కాఁడు. నీవు బ్రదుకఁదలంచితివేని జానకి నామహాత్మునకర్పించి శరణమంది సుఖంపుము. సుగ్రీవుండును నీతోనిట్టులే చెప్పుమనియె” నని యాంజనేయుఁడు దశముఖునితో నిర్భయముగాఁ బలికెను. రావణుఁడు కోపోద్దీపితుఁడై హనుమంతునివధింప నుద్దేశించెను గాని దూతను వధించుట ధర్మముగాదని విభీషణుండు బోధించుటచేత శాంతివహించి, యచ్చటనున్న దానవవీరుల నందఱను గాంచి, “వానరుని పుచ్ఛంబునకు వస్త్రంబులు చుట్టి

యందగ్నిఁ బెట్టుఁ" డని యాజ్ఞాపించెను. హనుమంతునిఁ బట్టుకొని దానవవీరులు రావణునియాజ్ఞ నెఱవేర్చిరి. పుచ్ఛగతవహ్నిదీప్తులు హెచ్చినకొలది రామానుగ్రహంబునఁ గపినాయకునకు సంతోషమధికమయ్యెను. లంకాపట్టణమంతయు నగ్నికి హోమద్రవ్యముగా నర్పించి వాయుజుండతిరయంబున సముద్రంబుదాఁటి యచ్చటఁ దనరాకకై యెదురుచూచుచున్న యంగదాదులఁజేరి జరిగిన వృత్తాంతంబెల్ల వారికి వినిపించెను. హనుమత్కృత కార్యంబునకు వారెంతయో సంతసమంది యతనిని మిగుల శ్లాఘించిరి. అంతట హనుమంతుఁడు వారింగూడి కడు శీఘ్రగమనంబున శ్రీరామసన్నిధికిం జేరి జానకీమహాదేవి యొసంగిన శిరోమణి నర్పించి, యామె వృత్తాంతంబంతయు సవిస్తరంబుగా విన్నవించెను. రాముండపరిమితానందంబును బొందుచు, "హనుమా! జానకీసతి జాడలు దెలియక నేను విపత్పాథోధియందు మునింగియుండఁగా నామె సేమంబును దెలిపి నన్నుద్ధరించి మిగుల సంతసంబుఁ గూర్చితివి. వార్ధి లంఘించి దేవతలయినను బ్రవేశింపరాని యీ లంకాపురంబును నీవు ప్రవేశించితివి గాని మఱియొకరికి సాధ్యముగాదు. నీవొనర్చిన యుపకారంబును వర్ణించుటకు నా కుక్షియందుఁ బదములు చాలకున్నవి" అని యనేకవిధంబులఁ బలికి యత్యంతభక్తిభరితుండగు వాతాత్మజునకేమియొసంగిననుఁ జాలదని తలంచి యా రాముండాలింగన వ్యాజంబున స్వాత్మప్రదానము నొసంగెను.

# జానకీదేవి.

## ఇరువదియవ ప్రకరణము.

### శరణాగతరక్షణ.

లంకలో జానకియున్నదని తెలిసినదిగదా! ఇంక నెట్లయిన లంకాపురంబునకరిగి దుర్మదాంధుండగు దైత్యుని మర్దించి జానకింగొనిరావలయును. రాముండు లంకాపుర ప్రయాణంబునకు వానరసైన్యంబును సిద్ధముఁజేయుమని సుగ్రీవున కాజ్ఞాపించెను. సుగ్రీవుండు సకలసైన్యంబులను నాయత్తపఱచెను. నీలుఁడు, జాంబవంతుఁడు, మైందద్వివిదులు, గంధమాదనుఁడు, సుషేణుఁడు, తారుఁడు, అంగదుఁడు మొదలగువారందఱును వానరవీరులు. రాముండు వీరినందఱిని గొంతకొంత సైన్యంబున కధిపతులుగాఁజేసి సమస్తసేనకును సుగ్రీవుని నాయకునిగాఁ జేసెను. హనుమంతుండు సకలబల చక్రంబునకును రక్షకుండై యొప్పెను. ఇట్లు యుద్ధంబునకుఁ గావలసిన సన్నాహంబొనరించుకొని రామలక్ష్మణులు వానరబలంబులతో నొక్క శుభముహూర్తంబున గిష్కింధానగరంబునుండి బయలుదేరి దినదిన ప్రయాణంబులఁజేయుచు సముద్రతీరంబునకుఁ జేరుకొని

యక్కడ విడిసి, సముద్రముదాఁటి యెట్లుపోవచ్చునని యాలోచింపసాగిరి.

అంత నక్కడ, రావణుండు చారులవలన శ్రీరాముండు లంకపై దండెత్తివచ్చుటకుఁ గపికులంబులతో సముద్రతీరంబున విడిసియున్నాఁడని విని కర్తవ్యంబునుగూర్చి మంత్రులు మొదలగువారితో యోజింపసాగెను. దుష్కార్యము సేయునప్పుడు మూఢులు ముందాలోచింపరుగాని చేసిన యనంతర మాలోచన యధికమైయుండును. రామునితోఁ బోరాటమింకఁ దప్పదని రావణుండూహించెను. దుష్టచిత్తులగు దైత్యవీరులనేకులు తమతమ ప్రాగల్భ్యంబుల వెల్లడించుకొనిరి. ఇంద్రజిత్తు తండ్రినిజూచి, " తండ్రీ! దీనికి నీవింత యాలోచించెదవేల? రాజ్యంబు విడిచి కానల యందు వసింపవచ్చిన యా రాముని విషయమున నింత యాలోచనయేల? ఇంతకును వారు సముద్రంబున కవ్వలి తీరంబునఁగదా యున్నారు? సముద్రంబును దాఁటిరాఁగలరా? వచ్చెదరుగాక, రణంబున వారి నుక్కడఁగించుటకు నేనొక్కఁడఁజాలనా? గజగవయజాంబవ దంగద సుషేణార్కసుత హనుమదాదులు నా బాణాగ్ని కాహుతులగుదురని తలంపుము. మహాసంగ్రామరంగంబున నింద్రుని నోడించి చెఱపట్టితెచ్చిన నాముందా నరులును, వానరులును నిలువఁగలరా?" యని పలికెను. అప్పుడచ్చోట విభీషణుండుగూడ నుండెను. అతఁడు దశకంఠుని తమ్ముఁడు. దైత్యుండయ్యును సత్వగుణంబు గలిగినవాఁడు. దుష్కా-

ర్యములొనర్పక జ్ఞానసంపన్నుఁడై చెలఁగుచుండును. రావ ణానుచరులగు దైత్యులు చెప్పుచున్న పలుకులాతని కనిష్ట ముగనుండెను. ఆతండు రావణునిజూచి యిట్లుపలికె. అగ్రజా! రావణా! సుచరిత్రుండయిన రాముని భార్యను దెచ్చినందువలన మనకీసంగరము రానున్నది. శూర్పణఖ చెప్పిన పలుకులాలించి, మారీచుని కురంగంబుగాఁజేసి రాముని వంచించి జానకిని దెచ్చితివి. దోషంబు మనయందే యున్నది. లంకారాజ్యరమకు నాథుండవై జగంబులెల్ల గడగడవడంకునట్లు బలశౌర్యంబులఁ దనరారుచు వనుమాత్ర మైనను శంకింపక జానకిని దెచ్చిననాఁటనుండియు గజాశ్వం బులు మేఁతలయినను మేయుటలేదు. కావున నా పలుకు లాదరించి శ్రీరాముని సన్నిధికేఁగి యపరాధంబు మన్నింవు మని జానకిని సమర్పించి శరణంబుసందుము. శరణాగత త్రాణ బిరుదాంకితుండగు నమ్మహానీయుండు నిన్నుఁ దప్పక రక్షించును. నీవీపని రామునిశరాంభోధి లంకను ముంచక పూర్వమే చేయవలయును. రామలక్ష్మణులనుగాని కపి బలంబులనుగాని నిర్జించునంతటి బలశౌర్యము మనయొద్ద లేదు. ఒక్క వానరుండు మొన్న సీతాన్వేషణంబునకు వచ్చి లంకఁగాల్చుచుండంగ నెవ్వరేమి సేయగలిగిరి? రా ముండు సామాన్యమానవుఁడుగాఁడు. నిన్ను వాలంబున బంధించి సముద్రంబులముంచి లేవనెత్తిన వాలి నొక్క మ్మునఁ గూలనేసి సుగ్రీవునకుఁ గిష్కింధ నొసంగినాఁడు. ఇప్పుడు నీ యనుచరులు పలుకు వాక్యంబులు నీకు ప్రియం

బులుగనే యుండునుగాని తుదకవి యహితంబులుగాఁ బరిణ
మించును." విభీషణుని హితోపదేశంబు రావణున కాగ్ర
హంబుఁ గలిగించెను. అవును రోగికిఁ బథ్యంబు రుచిం
పదుకదా! రావణుండు విభీషణునిపై మండిపడుచు నిట్లు
పలికె. "ఛీ! విభీషణా! ఎంతపిఱికిమాటలంటివి. నీవా
నాకు బుద్ధులు గఱపువాడవు. నీవంటి నీతికోవిదులిచ్చట
నెవ్వరును లేరని తలంచితివికాఁబోలు. నీవు నా యపకీర్తి
గోరి యిట్లు వచించితివిగాని మఱియొండుగాదు. చాలు
చాలు నీ హృదయంబు మధుపూరిత విషఘటంబని నేఁడు
దెలిసినది. గొఱియలమందలచందంబున దేవతా ప్రక
ణము దోలితిని. కుబేరునిగెల్చి తదీయ పుష్పకంబుఁగొంటి.
నా భుజాకండూతి దీర్చుకొనుటకై కైలాసకుధరంబెత్తితి.
అట్టి నేను రాముని శరణంబు సందుదునా? భండనంబున
రామలక్ష్మణసమేతంబుగాఁ గపిసేనలఁ జెండాడుదునుగాని
జానకినిమాత్ర మీయను. మహాసభయందిట్టి నీచవాక్యం
బులు పలికినందుకు నిన్నుఁ బ్రాణంబులతో మననీయరాదు"
అని పలికి యాతనిందన్నెను. అంతట విభీషణుం డన్నా!
యాగ్రహింపకుము. చెడిపోవుదువని తలంచి నేను చెప్పిన
బుద్ధులు నీకు విషతుల్యములయినవి. పోనిమ్ము. శ్రీరా
ముండు నిన్ను సంగరంబునఁ గూల్చునప్పుడయినను నన్ను
జ్ఞప్తికిఁ దెచ్చుకొందువు" అని పలికి సభనుండి వెడలిపో
యెను. విభీషణుండంతఁ జోటువాసి తన యనుచరులతోఁ
గామగమనంబున శ్రీరాముని సన్నిధికేఁగెను. కొందఱు

కపివీరు లాతనిం జూచి యీతఁడు దానవుండు మన రహస్యం బుల నరయుటకై యిట్లు ప్రచ్ఛన్నవేషంబున వచ్చినాఁడని రామునితోఁ జెప్పిరి. కాని రాముఁడు మాత్రము తొందర పడలేదు. విభీషణుండు నిర్భయంబుగా రాముని సమీపించి సాష్టాంగ నమస్కారంబులాచరించి, "దేవా! నేను రావ ణుని తమ్ముఁడ. విభీషణుండ. జానకిని మీకిమ్మని చెప్పి నందువలన రావణునిచేఁ బరాభవింపఁబడి మీ శరణంబు నందవచ్చినాఁడ" నని విన్నవించెను. హనుమంతుండు రా మునిఁ జూచి, "దేవా! ఈతఁడు గపటమానసుఁడుగాఁడు. నీతిజ్ఞుఁడు. చేపట్టదగినవాఁ" డని చెప్పెను. రాముండు విభీషణున కభయంబొసంగి యాక్షణంబునందే లంకా రాజ్యంబునకతని నభిషిక్తుఁ జేసెను. రాముండు సముద్ర తీరంబున విడిసినపిమ్మట మూఁడుదినంబులు గడచెను. సము ద్రంబు దాఁటిపోవుటకు మార్గముదోచలేదు. రాముండు లక్ష్మణునిజూచి, "తమ్ముఁడా! చాపమిటు దెమ్ము. సము ద్రంబు నింకించెద" నని పలికెను. రత్నాకరుఁడు భయం బంది యమూల్యరత్నాది పూజాద్రవ్యముల శిరమున నిడు కొనివచ్చి రాఘవునకుఁ బ్రణమిల్లి, "దేవా! ఆగ్రహింప కుము. మార్గమునొసంగెద. సేతుబంధనము గావింపు," మని విన్నవించెను. సేతునిర్మాణక్రియయందు నీలుండు ప్రధానుఁడయ్యెను. ఇట్లు సేతువునిర్మించి శ్రీరామలక్ష్మ ణులు కపిబలసమేతంబుగా దానిపైనుండి నడచి లంకాపురం బును నిర్విఘ్నముగాఁ బ్రవేశించి యొక్కస్థలంబున విడిసిరి.

# జానకీదేవి.

## ఇరువదియొకటవ ప్రకరణము.

### * సంకులసమరము. *

శ్రీరామాజ్ఞఁబూని కపిబలంబులు కోట ముట్టడించెను. లంకయందల్లకల్లోలంబుపుట్టెను. "శ్రీరాముఁడు మహాశూరునివలెనున్నాఁడు. దేవతలయినను బ్రవేశింపఁజాలని లంకాపురంబుఁ బ్రవేశించినాఁడు. అదియుంగాక విభీషణుండు నాచేఁ బరాభవమంది రామునిఁజేరి తప్పక నా మర్మంబులెల్ల నాతని కెఱిగించు" నని కర్తవ్యంబును రావణుండాలోచింపసాగెను. ప్రహస్తాదిమంత్రులు తమతమ శక్తులందెలిపి యాతని శంకమాన్పి రణంబునకు సంసిద్ధులై బలంబుల నాయత్తపఱచియుండిరి. రాముండు లోకాచారము ననుసరించి రావణునితో సంధివిషయమై మాటాడుటకు నంగదునిఁబంపెను. రణక్షోణియందు బలాబలంబులు దెలియవచ్చునని దశకంఠుఁడు ప్రత్యుత్తర మంపెను. రావణుండు కపిసేనల నెదుర్కొనుటకుఁ బ్రాక్పశ్చిమ దక్షిణ ద్వా

రంబులందు నిద్రజిత్ప్రహస్త వజ్రదంష్ట్రుల నియోగించి, యుత్తరద్వారంబును స్వయముగా నభిరక్షించుచుండెను. రాముఁడు రాక్షసవీరుల నెదుర్కొనుటకుఁ బవన జాంగద సుగ్రీవులను నియోగించి తానుత్తరద్వారముకడకేగెను. యుద్ధారంభమున హనుమంతుఁడు రావణునోడించి, దుర్వార బలులగు ధూమ్రాక్షాకంపనుల నంతబొందించెను. నీలుండు ప్రహస్తుని మృత్యువున కర్పించెను. అంగదుఁడు వజ్రదంష్ట్రునిఁబట్టి గట్టిగా మర్దించి ప్రాణావశిష్టునిఁజేసి విడిచెను. ఆ రాత్రి వానరులందఱు లంకలోఁ గొంత భాగము దగ్ధము గావించిరి. కుంభనికుంభులు వానరసేనపై బడి మర్దించిరి. నీలతారమైందద్వివిదులు పరాజితులయి మరల రణంబునకుఁ బురికొల్పఁబడిరి. సుగ్రీవుం డెట్టకేలకుఁ గుంభునిఁ దునుమాడెను. గిరులనైన నొక్కపెట్ట భేదించెడు పరిఘము నెత్తి నికుంభుఁడు రవిజునిఁగొట్టెను. శంకర వరప్రభావంబున నికుంభునకుఁ గొంతతడవు యుద్ధమున నిరుపమానబల మమరెను. జయముచేకూరెనని రాక్షసుండు గర్వించి పరిఘము ద్రిప్పుచు నట్టహాసముచేసెను. వానరబలంబులు దల్లడిల్లెను. రాక్షసుండు పరిఘంబును హనుమంతుని వక్షముపైఁ బ్రయోగించెను. పరిఘము భగ్నమయ్యెను. పవనుజుఁడు ముష్టియుద్ధములో రాక్షసుని రూపుమాపెను. బ్రహ్మ వరాభిగుప్తులగు సుప్తఘ్నాది నిశాచరులు వానరసేనలను దునుమాడుచుండ రాముండేతెంచి వారిం బరిమార్చెను. అశ్వారూఢుఁడయి నరాంతకుండు వానరసేనలపై దుమికెను.

వానరులు బరుగువెట్టసాగిరి. అంగదుండు వారిం బురికొల్పు కొని నరాంతకుని దాఁకి యమువీటికిఁ బంపెను. దేవాంతకుండు గపిసేనలను శరవృష్టులచేఁ బీడింపసాగెను. జాంబవంతుండు పరుగువెట్టెను, అంగదుండు మూర్ఛిల్లెను. సుగ్రీవుండు పర్వతమునెత్తి రాక్షసునిపైఁ బ్రయోగించెను. నిశాచరహస్తప్రముక్త బాణధారలఁ బర్వతము చూర్ణమాయెను. కాలానల సదృశశరమునేసి, రాక్షసవీరుఁడు సుగ్రీవుని మూర్ఛిలఁగొట్టెను. వాయుజుండు కోపావేశంబున రథముపైకి దుమికి ధనుర్బాణంబులను చేతనుండి పెఱికి ఖడ్గముతో దేవాంతకుని కంఠంబు నఱికెను. సుపార్శ్వుండను దానవుండు దండతాడిత మహోరగంబుకరణి మండిపడుచు మత్తగజతుండంబులభాతి భుజంబులుసాచి, పండులు గీటుచు భూనభోంతరాళంబెల్లఁ బ్రతిధ్వనులిచ్చునట్లు ‹‹ పదపద ” మని తన సారథిం దొందరపెట్టుచుఁ గదురయంబున రామునిం దాఁకవచ్చుచుండ వాలి పుత్త్రుండగు నంగదుఁడాతని కడ్డుపడెను. ఇరువురును బ్రచండభండనంబునకు దార్కొని యొడలు తెలియక పోరుచుండిరి. సుపార్శ్వుండు కాలభైరవావతారంబోయన నొక ప్రక్క నంగదునిపై శరవర్షంబు గురిపించుచు వేఱొక ప్రక్కనుండి కపిసైన్యంబును చెల్లాచెదరు గావించుచుండెను. ఆతని బాణజ్వాలలకు సైపఁజాలక కపులు నలుదెసలం బరుగులిడుచుండ నతండు వారిని విడువక, ‹‹ ఓరోరీ! మహాపాతకులారా! దుష్టవానరులారా! ఇప్పుడు మీరెందుఁబోయెదరు? శౌర్యంబుఁబూని

నిలుఁ" డని పలుకుచు రిపుసైన్యంబును వెన్నంటి వీరనక వారనక యెదురైన వానరుల దన కరవాలంబున కెరసేయుచుండఁ గపిసేనలు పాఱఁదొడంగినవి. పరుగిడుచున్న కపిసైన్యంబులంజూచి, "ఓ వనచరులారా! ఒక్క మృక్కడి రక్కసునకు భీతిల్లి పాఱిపోవుట మీ కుచితముగాదు. సంగ్రామరంగంబున జయంబుగాంచితిమా శ్రీరామునిచేఁ గొనియాడఁబడుదుము. చచ్చితిమా వీరస్వర్గము నందుదుము. అంతియకాని రిపులకు వెన్నిచ్చి పరుగిడుట శౌర్యముకా," దని పలుకుచు నంగదుండు వానరబలంబుల మరలించుకొని సుపార్శ్వుందాకి వీరావేశంబున నతని కేతనంబు ముత్తునియలుగాఁజేసి రథచక్రంబులు విఱుగఁగొట్టి, సారథింజంపి, గుఱ్ఱంబుల వధించెను. సుపార్శ్వునకు వేఱొక్క రథంబుదెచ్చి యిచ్చువాఁడైనను గానిపింపమి నాతఁడంగదునితో ముష్టియుద్ధ మొనరించి తుదకు నిహతుండయ్యె. సుపార్శ్వుని మృతివిలోకించి దనుజబలంబులు వెన్నిచ్చిపాఱె. కపిబలంబులందు సింహనాదంబులు మెండయ్యెను. ఇదియంతయుఁ జూచి, రావణునకు ధాన్యమాలియందు జనించినవాఁడును, బ్రహ్మదత్తవరుండును, దేవతాకాండ భయాపాదియునగు నతికాయుం డర్కసహస్రనిభంబగు రథంబధిరోహించి సేనలం బురికొల్పుకొనివచ్చి కడురయంబునఁ గపిసేనలం దాఁకెను. అతఁడు తిన్నగా రామలక్ష్మణు లున్నయెడకరిగి వారిం జూచి, "ఇదిగో చాపహస్తుండనై బలవిక్రమంబులు మెఱయ నేతెంచినాఁడ. మీలో నాతోఁ బోరఁగలవాఁడు గలం

డేని సత్వరమ్ముగా రణరంగంబున కవతరించుఁగాక! యని పలుక రూక్షేక్షణుండై లక్ష్మణుం డతనినివీక్షించి "ఓరీ! దానవాధమా! ఇంతవఱకు నా హస్తంబునఁ బడి చచ్చిన దానవాధముల నీ వీక్షించియుంటివిగదా? అస్మదీయ చాప ముక్త శితమార్గణపంక్తి సహింప నీ కుఁదరంబుగాదు. ఆశీవిషంబులఁబోలు నదియాశుగంబులు త్వదీయరక్త మాస్వాదించి తీరును అని ప్రత్యుత్తరంబిచ్చి కల్పాంత కాల మృత్యుంజయావతారంబో యన నాతని నెదుర్కొని వివిధ నారాచ పరంపరలం గురిపించుచుఁబోరె. లక్ష్మణునిచేఁ ప్రయోగింపఁబడుచున్న శరంబుల నొక్కింతయైనను జలింపక యతికాయుండు వాని నన్నిటిని ఖండించుచుండెను. తన శరంబొక్కటియైనను బనిసేయకుండుటఁజూచి సౌమిత్రి నిశ్చేష్టితుఁడై యుండఁ బావని యాతనికడకరిగి, "లక్ష్మణా! ఈ యతికాయుండు బ్రహ్మవరంబునంజేసి యభేద్యతను త్రాణుండై యొప్పుచుండు. బ్రహ్మాస్త్రంబున వీఁడు వధ్యుండగు" నని చెప్పెను. లక్ష్మణుండు బ్రహ్మాస్త్రంబును సంధించి సమంత్రకంబుగా విడిచి యతికాయుని నేలంగూల్చెను. రావణుండనేక సేనలతో రణరంగంబును బ్రవేశించెను. సుగ్రీవ గజగవాక్షగంధమాదనులు కొంతవఱకు దశకంఠునితోఁ బోరుసల్పిరి. రావణుండు వానరత్రయమును మూర్ఛనొందించెను. హనుమంతుని ముష్టిప్రహారంబులకు దాళ [illegible] డక్కి నీలునిపై [illegible] స్త్ర[illegible] ప్రయోగించెను. నీలుండగ్నిపుత్రుండగుటచే నాగ్నే

యాస్త్రము వ్యర్థమాయెను. రావణుఁడు క్రుద్ధుండై బ్రహ్మ దత్తశరము నా కర్ణాంత మాకర్షించి లక్ష్మణుని లలాటముపైఁ బ్రయోగించెను. సౌమిత్రి మూర్ఛిల్ల నాతని నెత్తుకొని పరుగిడుటకుఁ గడంగుచున్న రావణుని హనుమంతుండు మూర్ఛిలఁ గొట్టి సౌమిత్రిని రామపదాంతికంబునకుఁ గొని పోయెను. రామ కరసంస్పర్శమాత్రంబున లక్ష్మణుఁడు మూర్ఛఁ దెలిసెను. రామరావణులు విచిత్రగతుల సమరంబు సలిపిరి. భూనభోంతరాళంబులు శరంబులతో నిండి యుండెను. అంధకారము ప్రసరించెను. రాముఁడు పరికించి యొకశరము వేసెను. రావణుని రథము, హయములు, సారథి, ధ్వజము, శ్వేతచ్ఛత్రము, కిరీటము నేలఁగూలెను. ఆతండు కాందిశీకుండై యిల్లు సేరెను.



# జానకీదేవి.

## ఇరువదిరెండవ ప్రకరణము.

### * మేలుకొలుపు. *

ఉభయపక్షంబులవారును రణంబునకుఁ దలపడిరి. ఆ సమయంబున వికటగతిం బఱతెంచు రథగజతురగపదాతి చరణతల సంఘట్టనంబులఁ గెంధూళి మార్తాండమండలంబుఁ గప్పుటయు, భూగగనాంతరాళంబెల్ల మహాంధకారంబుగప్పి సైనికులకుఁ గన్నును మిన్నును దెలియనీయక భయంబు గలుగఁజేయుచుండ నయ్యిరువాగులవారును, రణంబునకుఁ గడంగి మోహరించిరి. శంఖముఖానేకవాద్యంబులును, మత్తకరి సముదయబృంహితంబులును, రథనిచయసంఘట్టనంబులును, తురంగబృందహేషానిస్వనంబులును, వీరభటసింహనాదంబులును, ధనుర్జ్యాటంకారరవంబులును, నెన్నిడి పరుగిడుచున్న తమ తమ సేనలను బురికొల్పుచుఁ బేరు పేరునఁ బిల్చు సేనాధిపతుల యాహ్వానధ్వనులును, ప్రతిధ్వనులిచ్చునట్లు కేకలిడుచు, వీరవరులు ప్రచండ గదాదండంబుల నొండొరుల మోదుచుఁ బరిఘంబులచేఁ దలలు పగులఁగొట్టుచు, శరంబులచే నురంబులు గాడనేయుచుఁ, గరవాలంబులచే గంఠంబులు నఱకుచు, బాణవర్షంబు గురియుచు, ఘనశౌర్యవిజృంభణమునఁ బోరుచుండిరి. ఆ

సమయంబున విభిన్నకాయంబులై నేలంగూలు శుండా
లంబులును, నిహతసారథికంబులై తెరలిపాఱువారువంబులు
గలతేరులును, నెత్తురులు గ్రక్కుచు నుక్కుచెడి మ్రగ్గుపదా
తులును, గలిగి యుద్వేల కీలాలపూరంబులు నీరంబుగ,
సామజ కళేబరంబులు తీరంబులుగ, ఖండితవీరభట కరచర
ణాదులు జలచరసముదయంబుగ, బాండురాతపత్రోష్ణీష
సమూహంబులు హంసంబులుగ, వికీర్ణకేశపాశంబులు శైవా
లంబులుగ, మాంసపుముద్దలు దీవులుగ, గీకసగణంబులు
శంఖంబులుగ, రక్తనది పొంగి పొరల భూతబేతాళ శాకినీ
గణంబులను, గంకగృధ్రతలరవంబును గలిగి భండనభూమి
మిగుల బీభత్సంబై యుండెను.

రావణుని పక్షంబుననున్న వీరులు పెక్కండ్రు మడి
సిరి. దానవబలంబు లనేకంబులు నశించినవి. రావణుండు
మిగుల విచారంబునంది, నిద్రించుచున్న కుంభకర్ణుని
యుద్ధంబునకుఁ బంపుటకు నిశ్చయించెను. కుంభకర్ణుం డెట్ట
కేలకుఁ నిదుర మేల్కాంచి మాంసరాసులను, భక్ష్యములను
భుజించి, రక్తంబు ద్రావి సభాస్థలంబునకు వచ్చెను.
“ రాముండను నరుండు మనపైకి దండెత్తివచ్చి మన బలం
బుల దునుమాడెను. నీవేగి యాతనిని బరిమార్పవలయు ”
నని రావణుండాతనితోఁ బలికెను. సమరకారణంబగు
సీతాపహరణ వృత్తాంతమునాలించి, “ అకారణముగ రాము
నితోఁ గయ్యము పెట్టుకొంటివి. లంకకుఁ జేటువాటిల్లెను.
బలవంతునితో విరోధముతగదు. జానకిఁనర్పించి యప్పరు

షోత్త్రమునితోఁ సంధి గావింపుము. నీవు సుఖింపఁగల" వని కుంభకర్ణుండు పలువిధంబుల బోధించెను. "దోషంబుల నెంచుటకిది సమయము గాదు. నీ సాహాయ్యంబు గలదని ధైర్యమునఁ బ్రవర్తించితి. అసత్యము విననొల్ల" నని రావణుండు వచియించెను.

శూలహస్తుండై కుంభకర్ణుండు రణరంగంబునకువచ్చి నిలిచెను. అవలోకనమాత్రముననే కపివీరు లనేకులు బయంబంది పలుదెసలం బరుగులిడిరి. కేసరి శతబలిగజ గవయాదివానరులు ప్రథమ యుద్ధముననే కుంభకర్ణునినోటఁ బడిరి. కుముదాదులంగుళీవివరములఁ జిక్కువడిరి. నీలాదులు మూర్ఛాగతులైరి. అంగద జాంబవంతుల నోడించి కుంభకర్ణుండు రణరంగంబునుండి మరలెను. సంకుచితరూపంబున హనుమంతుఁడు వానివెంటనంటి మర్దించెను. కుంభకర్ణ దేహాంతర్గత వానరులాతని రోమకూప మార్గంబుల నుండి మరలిచ్చిరి. కుంభకర్ణుఁడు మరల రణరంగంబున కరుదెంచి సౌమిత్రిని లెక్కసేయక రాముని నెదుర్కొనెను. ఇరువురకును పోరు ఘోరంబుగ జరిగెను. తనచేఁ బ్రయోగింపఁబడుచున్న దివ్యాస్త్రంబులు వ్యర్థములగుచుండెనని తలంచి శ్రీరాముండు వజ్రసదృశ బాణముఁ బ్రయోగించి కుంభకర్ణుని నేలంగూల్చెను. కుంభకర్ణుని మృతిఁజూచి సకల దానవబలంబులును భయబంది తిరిగిచూడక వెన్నిడి లంకకుఁ బరుగువెట్టిపోయెను. కపిబలంబులు సంతోషంబున సింహనాదంబులు గావించెను.

# జానకీదేవి.

## ఇరువది మూడవ ప్రకరణము.

* అరుణోదయ కాంతి. *

కుంభకర్ణుని మరణంబు వినినంతనే రావణుండు ధైర్యముం గోలుపోయెను. ఇంద్రజిత్తు జనకునకు ధైర్యము చెప్పి హోమములచే రుద్రునర్చించి, రథారూఢుండై రణరంగముం జొచ్చి నాగపాశంబులచేఁ గపిసేనలనెల్ల బంధించి, యవ్వార్తను జనకునకుఁ దెలుపుటకు మరలిపోయెను. విష్ణ్వాజ్ఞను మదినెంచి, స్మరణమాత్రమున గరుడుఁడు రామునకుఁ బ్రత్యక్షమై, నిజపక్షోద్ధత వాయుప్రసారములచే వారి బంధంబులఁ బాపెను. మేఘనాదుండచ్చెరువంది, మహాస్త్రములనేసి కపిసేనలను మూర్ఛిల్లఁగొట్టెను. శత్రువుల జాడల నెఱుంగుటకుఁ బోయిన విభీషణుండువచ్చి కపిసేనలఁ జూచి దుఃఖించెను. హనుమత్కృత శైత్యోపచారంబులవలన జాంబవంతుండు తెలివినొంది, "ఈవు ప్రాణప్రదుండవు. గంధమాదనంబునందున్న దివ్యౌషధులం దెచ్చి వానరులం బ్రదికింపు" మని వేఁడికొనెను. అనిలసుతుండు వాయువేగంబునఁ బోయి గంధమాదన పర్వతంబుఁ బెల్లగించి తెచ్చి కపిబలంబులమధ్యనుంచెను. ఆ గంధము సోకినంతమాత్ర

మునునే కపులు మూర్ఛఁదెలిసితేచి సింహనాదంబులు గావించిరి. అస్త్రములు వ్యర్థమాయెనని రావణి దిగులొంది, ఘోరమార్గముల హోమాది కార్యంబులంజేసి సమ్మోహనాస్త్రముచేఁ గపిసేనలను మరల మూర్ఛిలఁగొట్టెను. రాముఁడు విజ్ఞానాస్త్రముఁ బ్రయోగించెను. ధృతిమాలి రావణి నికుంభిలాప్రదేశమున కేఁగి హోమక్రియలఁ బ్రారంభించెను. ఈ రహస్యము విభీషణుండెఱింగి, "రుద్రయాగము పూర్తియగునేని మేఘనాదునోడించుట కెవ్వరికిని దరముగా" దని రామునితో విన్నవించెను. 'వెన్నిచ్చి పరుగిడిన రిపునిఁ జరిమార్చుట క్షాత్రధర్మము కాదని యూరకుంటి' నని రాముఁడు పలికి "యాగక్రియలకు నంతరాయము గల్పింపుఁ" డని వానరుల కానతిచ్చెను. వానరులింద్రజిత్తుపైఁబడి యల్లరిచేయసాగిరి. విధిలేక హోమముఁ బరిత్యజించి యింద్రజిత్తు రణరంగంబును బ్రవేశించెను. లక్ష్మణుండాతని నెదుర్కొని ఘోరంబుగఁబోరి వివిధనారాచపరంపరలంగప్పి నేలంగూల్చెను. ఇంద్రజిత్తు నేలఁగూలుటచూచి దనుజవీరులందఱును లంకకు బలాయితులైరి. కుమారుని మృతి రావణుండాలించెను. ఆతని శోకంబునకు మేరలేదు. ఎట్టకేలకు రావణుండు ధైర్యముఁబూని ప్రళయాగ్నివలెఁ గపిసేనలం దాఁకెను. ప్రకృతిచే రావణుండనన్యసాధారణబలోపేతుండు. బ్రహ్మదత్త వరప్రభావంబున సమస్తాస్త్రవేత్తయై యొప్పుచుండెను. బహుసంఖ్యాతములయిన రాక్షససేనలను మనుమాపుటకు సమరసమయం

బున రాముఁడనంతరూపంబులందాల్చె. రణరంగంబంతయు రామరూపమయమై యుండెను. మహోదర మహాపార్శ్వులను దానవులను సంగరమందు మృత్యువునకర్పించెను. విరూపనేత్రయూపనేత్రులు కాలానల సదృశ బాణతతులచేఁ బంజరముఁగల్పించి యంగదుని బంధించిరి. రవిజుండు వారిని వధించి యంగదుని విముక్తునిగాఁజేసెను. రావణుండుగ్రుఁడై మయదత్తశక్తిని బ్రయోగించి సౌమిత్రిని మూర్ఛఁగొల్పెను. హనుమంతుండు లక్ష్మణుని నెత్తుకొని రాముని సన్నిధికిఁ దోడ్కొనిపోయెను. రాముండు మూర్ఛిల్లియున్న తమ్మునిఁజూచి మరణించెనని యనేకభంగుల విలపించెను. సుషేణుఁడు మొదలయిన వానరులాతనికి ధైర్యముజెప్పి, సూర్యోదయము గాకపూర్వము సంజీవిఁదెమ్మని హనుమంతుని వేడుకొనిరి. హనుమంతుం డంగీకరించి బయలువెడలెను. హనుమంతుండు సంజీవి తెచ్చుట కరుగుచున్నాఁడనియు, సూర్యోదయము గాకపూర్వము సంజీవి రాని యెడల లక్ష్మణుండు ప్రాణంబులు వాయుననియు రావణుండెఱింగి, మార్గంబున వేచియుండి హనుమంతుని మోసపుచ్చుటకై కాలనేమియను నొక దనుజుని నియోగించెను. కాలనేమి తపసివేషము ధరించి మార్గమధ్యమందుండెను. విధివశంబున హనుమంతుండు దాహంబుగొని యయోగికరిగి కపటతాపసుంజూచి, “ మునీంద్రా! నేను రాముని బంటను. హనుమంతుఁడను. సంగరంబున సౌమిత్రి, మూర్ఛ మునింగి యున్నాఁడు. అందుకై సంజీవి దెచ్చుటకుఁ బోవుచు

మార్గముఁ దప్పితి. దాహబాధ యధికంబుగా నున్నది. పానీయంబు లెచ్చటఁ గానగునో యెఱింగింపుమని పలికెను. ఎట్లయినను వంచింపఁదలంచి కపటవేషంబు ధరించిన యీ కాలనేమి హనుమంతునిఁ జూచి యిట్లుపలికె. “నీ రాకకుఁ గారణంబంతయు నేను దివ్యదృష్టిని గనుంగొంటిని. రామభక్తుండవగుటచే నీవు మాకుఁ గడుఁగూర్చు ప్రియుండవు. నేఁటికి నీవిచ్చటనుండి నా యాతిథ్యంబు సంగీకరింపుము. లక్ష్మణుండు మూర్ఛ దెలియుటకు దివ్యౌషధంబుల నొసంగెద. గడియలో లంకకేఁగు సామర్థ్యంబు మంత్రమహిమచే నీకుఁ గూర్చెద” “అచ్చట రాముని తమ్ముఁడు మూర్ఛ మునింగియుండఁగానే యాతిథ్యంబు సంగీకరించి యిచ్చటనుండుటకు నా చిత్తంబు సమ్మతింపదు” అని పలికె, యమ్ముని యొక కమలాకరంబునకు మార్గముఁజూప హనుమంతుండచ్చోటు వాసెను. కాలనేమిచెప్పిన సరోవరంబగాధమైయుండె. అందు దిగినవారినెల్ల నొక మొసలి తన పొట్టంబెట్టుకొనుచుండును. హనుమంతుఁడది యెఱుఁగక యమ్మడువుంజొచ్చి నీరంబులు ద్రావబోయెను. దుష్టగ్రాహంబాతనిని బట్టె. ఎంత బలాఢ్యుఁడయిన మకరిచేఁ జిక్కి బ్రతుకుట కష్టము. సూర్యోదయము గాకపూర్వమాతఁడు సంజీవిఁ గొనిపోవకున్నచో లక్ష్మణుండు ప్రాణముఁబోయును. ఎట్టకేల కాతఁడు ధైర్యము నవలంబించి తన గదాదండంబుచే నామకరిం జీల్చెను. మకరి స్త్రీరూపంబు ధరించి యాతని యెదుట నిలిచెను. అక్కమలాకరంబుననున్న

మొసలి తన్ను మ్రింగునను తలంపుననే తన్నచ్చటికిఁ బంపె
ననియు, నాతఁడు కపటమునియనియు హనుమంతునకుఁ
దోఁచెను. మొసలి స్త్రీయైనందుకు వాయుసూనుం డచ్చె
రువందె. ఆమె యొక్క త్రిదశకాంత. ఆమె నివా
సము గంధమాదనము. ఒక్క దినంబున జలక్రీడా సమ
యంబున శాండిల్యుఁ డీమెకడ కరుదెంచి కామమోహి
తుఁడై తన కోర్కె దెలిపెను. "రజస్వలను, కృతస్నాతం
గానిందు" అని యయ్యువిద ప్రత్యుత్తరం బిచ్చెను.
అనంతరమీయామె స్నానం బాచరించి మునీంద్రునియొద్ద కరుగ
నున్న సమయంబున రావణుండు సేనలతో నాపర్వతముపై
విడిసియుండి యీమెం జూచి మోహావేశపరవశుండై బలా
త్కారంబునఁ దన యభీష్టంబుఁ దీర్చుకొనెను. తరువాత
నీమె శాండిల్యు సన్నిధికరుగ "దఁపోమహిమంబున సర్వము
నెఱింగి యకార్యాంతను మకరివగుమనియు, రణంబున రావ
ణుండు పుత్రామాత్యభృత్యాది వర్గంబుతోఁ గూలుననియు,
శపించెను. కాని యీమెయెడ నించుక కరుణించి హను
మంతునివలన శాపవిముక్తి గలుగునని పలికెను. హను
మంతుడామెవలన సమస్తంబునెఱింగి, ద్రోణాద్రికేగి సంజీవిఁ
గొని తెచ్చుచు మార్గంబున మాయతాపసుఁడగు కాలనేమిని
దన గద కెఱసేసెను, హనుమంతుండు దెచ్చుచున్న సంజీవి
ప్రభ యరుణోదయము చందంబున వెలింగెను. రాముం
డదిచూచి సూర్యుం డుదయించుచున్నాఁడని తలంచి సుగ్రీ
వునింజూచి, "చాపమిటు దెమ్ము. రవి తన కులము వాఁ

డగు నా తమ్ముఁడు మృతినందునని యైనను దలంపక యుదయించుచున్నాఁడు. ఈతని నా బాణంబులపాలు గావించెద" నని పలికెను. సుషేణుఁడు "దేవా! తొందరపడకుము. అయ్యది హనుమంతుఁడు తెచ్చు సంజీవనౌషధుల ప్రభ," యని పలికి వారించెను. ఇంతలో హనుమంతుఁడు సంజీవితో రాముని సన్నిధికి వచ్చెను. లక్ష్మణుఁడు మూర్ఛఁదెలిసి లేచెను. కపులు సంతోషంబునఁ గోలాహలము గావించిరి.

# జానకీదేవి.

## ఇరువది నాల్గవ ప్రకరణము.

### * శోకకర్షణము. *

తమోవిచ్ఛిత్తికై భానుండుదయాద్రినెక్కినమాడ్కి లోక బాధలం దొలఁగించుటకు శ్రీరాముం డింద్ర ప్రేషిత దివ్య రథంబు నెక్కి సమరమునకుపక్రమించెను. రావణుఁడు ప్రయోగించిన శస్త్రాస్త్రము లన్నిటిని రాముఁడు సంహరించెను. లోకత్రయ వాసులలో మున్నెవ్వఁడును నెఱుంగని మహాస్త్ర విద్య లన్నియు నీ సమయంబునఁ బ్రదర్శింపఁబడెను. అన్యోన్య జయాభిలాషు లగుచు దీర్ఘకాల మా వీరులు ఘోరంబుగఁ బోరాడిరి. బాణ నిస్వనంబులతో బ్రహ్మాండమునిండె. ఘోరాస్త్ర ప్రయోగంబుల వలన లోకంబుల కేమి కీడు మూడునో యని బ్రహ్మ రుద్రాదు లడలుచుండిరి. సమరమున కంతము కాన రాదయ్యె. ఆనాఁడు రావణుండు రామునిచేఁ బరాజితుండై లంకకు మగిలిపోయి, యింక సంగరంబొనర్చుట వలనఁ బ్రయోజనము లేదని తలంచి యొక్క రహస్య ప్రదేశంబున హోమం బాచరింపఁ బ్రారంభించె. ఆ హోమ కార్యం బంతరాయము గలుగకుండ జరిగెనేని తాను సఫలీకృత మనోరథుండ నగుదు

వని తలంచెను. ఈ రహస్యము విభీషణుఁ డెఱింగి రాముని కెఱింగించెను. అనేకకపులా హోమంబునకు విఘ్నంబు గలిగింప నేఁగిరికాని రావణుం డించుకేనియుఁ జలింపక తన కార్యంబునందే వర్తించుచుండెను. కపుల యెల్లరి యతనిం జలింపఁజేయలేదు. అంగదుండు మరల నీ కార్యంబున నియోగింపఁబడియెను. అంగదుండు తన సాహసంబున రావణుని మందిరంబుఁ బ్రవేశించి రావణుని భార్యయగు మండోదరి శిరోజంబులను బట్టుకొని యీడ్చుకొనివచ్చి యాతఁడు హోమముఁ జేయుచున్న ప్రదేశంబునకు వచ్చెను. "కుమారా! నీకిది తగదు. వదలు" మని మండోదరి యెంతయో బ్రతిమాలుకొనెనుగాని యంగదుండామెను విడువక హోమముసేయుచున్న దశకంఠునిఁ గాంచి "ఓరీ! రావణా! మారీచుని మాయాకురంగంబుగఁ జేసి నీవు కపట భిక్షుకుండవై రాముని పరోక్షమున జానకిని వంచించి తెచ్చితివి. ఇదిగో! చూడుము. దానవవీరులందఱునుఁ జూచుచుండ నీ గృహిణియగు మండోదరి కురులనుఁ బట్టుకొని నీ యెదుటనే యీడ్చుకొనిపోవుచున్నాను. ఏమిసేయ దలంచితివో యదియంతయుఁ జేసి నీ బలంబుఁ జూపు" మని గంభీరంబుగ బలికెను. మండోదరి రావణునిఁ జూచి యిట్లు పలికె. "ప్రాణేశ్వరా! వనంబులందుఁ దపోవృత్తినున్న మనుకులతిలకుండగు శ్రీరాముని వంచించి యాతని భార్యను దెచ్చినావు. అదియొక పౌరుషముగాదు. సకలదానవ వీరులునుఁ గన్నులారఁ జూచుచుండ, జగద్భయంకరుండవై

యొప్పు నీ భార్యనగు నన్ను వనచరుండు భయంబింతయులేక యిట్లీడ్చుకొనిపోవుచున్నాఁడు. నా యనుంగుఁ గుమారుండయిన మేఘనాదుండు బ్రతికియున్నచో వానరుండింత సాహసంబొనరించునా? నన్ను రక్షింపుమని నేను నీ దరికి వత్తునా? శ్రీరాముని జయించుటకు మంత్రంబులును, హోమంబులును నేమియుఁ బనిసేయవు. భండనపాండితియు, బలశౌర్యంబులును గలిగియున్నచో నాతనియెదుట నిల్చి రణంబొనరింపుము. లేదేని జానకీయుతంబుగా లంకారాజ్యంబంతయు నమ్మహాత్మున కొసంగి నమస్కరింపుము" అంగదుని వాక్యంబులకు దశకంఠుండు చలింపలేదుగాని మండోదరీవచనంబులాతనికిఁ బౌరుషము పుట్టించెను. తన భార్య యొరులచేఁ దన కన్నులయెదుట బరాభవమందుచుండఁగా నెవ్వఁడు చూచి సహింపఁగలఁడు. భార్యమాటలకు రోషావేశపరవశుండై యాతఁడు హోమంబు విడిచి వచ్చెను. అంగదుఁడు తానువచ్చిన పనియైనదని యచ్చోటు వాసి యీ వార్తఁ దెలుపుటకు శ్రీరాముని సన్నిధికరిగెను. రావణుండు ప్రళయాగ్నిచందంబున మండిపడుచువచ్చి మండోదరినిజూచి "రమణీ! నిన్నిరీతిఁ బరాభవించిన దుష్టాత్ముండెవ్వఁడు, వాఁడెందున్నను దప్పక వధించెదను. నీవింక విచారింపకుము. నేఁడు శ్రీరామలక్ష్మణులు నా బాణాగ్నికి శలభంబులయ్యెదరని తలంపుము. నేను రామునిఁ గూల్పలేకున్నచో రామునిచే నేనే కూల్పఁబడుదు. ఒకవేళ విధికృతంబున నట్లయినచో నీవు శీఘ్రంబుగా నవల

ప్రవేశం బొనర్పుము," అని పలికెను. మండోదరి శ్రీరా
ముని మహిమంబును, నతని యవతారంబులను నుగ్గడించి,
"దేవా! రామునియెదుట నిలుచుట కెవ్వరికిని దరము
గాదు. సీతాసహితంబుగ లంకాపురంబు నాతనికి సమ
ర్పించి శరణుఁబొంది మనము తపోవృత్తి నుంద," మని
వచించెను. రావణునకుఁ దెలియని విషయంబేమియును
లేదు. ఆతఁడు బ్రహ్మవేత్త. అతఁడు నిజభార్య నవలో
కించి యిట్లు పలికె. "తరుణీశిరోమణి! నీవు నా క్షేమం
బును విచారించి చెప్పిన పలుకులను నేనెంతయు సంతసించి
నాఁడ. అనేకులు సీతాపహరణోద్యోగంబుఁ బూనవలదని
నా కెన్నియొ హితంబులు పలికిరి. అవియన్నియుఁ జెడ
చెవింబెట్టి యందని మ్రానిపండులకు హస్తంబులఁ జాచితిని.
ఇట్టి యకార్యంబాచరించి తమ్ముండగు కుంభకర్ణుని, నంద
నుండయిన మేఘనాదుని, సకలబంధువులను రణంబున
మ్రందఁజేసితిని. ఇంక నాకు రాజ్యంబును, సుఖంబునునేల?
నీవు చెప్పినట్లు నేనిప్పుడు శ్రీరాముని శరణు వేడుదునుగాక.
ఆతఁడు కరుణామయుండగుటచే నన్నుఁ దప్పక రక్షించు
గాక. నా కుమారుండును, తమ్ముఁడును వచ్చెదరా?
నీవు నన్ను దాపసవృత్తి నుండుమని చెప్పితివి. ఈ మాట
మాత్ర ముచితముగ లేదు. జగద్భయంకరుండనై, లంకా
రాజ్యలక్ష్మీమనోహరుండనై, యింద్రుని నోడించి, భూసు
రులకు బాధఁ గలుగఁజేయుచు మునుల హింసించుచు
మహాపాపంబు నార్జించియున్నాను. అట్టి నేనిప్పుడు తపసి

నైతినేని లోకులు నన్నుఁజూచి పరిహసింపరా? అదియుంగాక మదీయహస్తంబున నీ చంద్రహాసమున్నంతవఱకును దీనవృత్తి నేనెన్నఁడు నవలంబింపను. ఇంకొక్కరహస్యము కలదు. శ్రీరాముండు విష్ణుమూర్తియనియు, జానకి లక్ష్మియనియు నాకుఁ దెలియును. ముక్తికాంతాసీమంతినిం బొంద నిక్కార్యంబుఁ జేసినాఁడను. సాక్షాద్విష్ణుండగు శ్రీరామునితోఁ బోరుసల్పెదను. గెల్చితినా మదీయ యశోవల్లిక సకలదిగంతములఁ బ్రాకును. లేక నే నాతనిచేఁ గూలితినా నిత్యానందమగు స్వర్గపదంబుఁ గాంచెద. ఇంక నీవు సందియంబందక గృహంబున కరుగుము. నేను భండనభూమిం బ్రవేశించెద" రావణుని మాటలు విని మండోదరి చేయునదిలేక గృహంబున కరిగెను.

# జానకీదేవి.

## ఇరువదియైదవ ప్రకరణము.

### * విజయము. *

రావణుండు రణరంగంబుఁ బ్రవేశించెను. తన బలంబంతయు నశించుటయుఁ గపిబలంబులందొక్కవీరుం డైనను మొక్కవోకుండుటయునుఁ గని యాతండు మిగుల నిర్విణ్ణుండై యుండెను. ఎట్టకేలకు ధైర్యముఁబూని రావణుఁడా శ్రీరామునిం దాకెను. రామరావణు లిరువురును సమరశాస్త్రవేత్తలే. శౌర్యబలపరాక్రమములందొకరుఁ దీసి. పోవువారుగారు. అన్యోన్యజయాభిలాషులై దీర్ఘకాల మిరువురుఁ బోరుసలిపిరి. రణరంగంబున నేదిక్కునఁ జూచినను రావణునకు శ్రీరాముండే కనఁబడుచుండెను. ఆతని కేమియుఁ దోఁపదయ్యెను. రాముండు వీరపురుషోచిత వాక్యంబులచే నాతనికిఁ బౌరుషము పుట్టించుచుండెను. నిజాధిక్యమును భక్తజనులెఱుంగుటకును, రావణుని బలవీర్యములను లోకమునకుఁ బ్రదర్శించుటకును, రాముఁడు వివిధ నారాచపంక్తులు రావణునిపైఁ గప్పి యాతని శిరంబుల నూడఁగొట్టెను. అయ్యవి మరల మొలకలెత్తెను. రణ

మున కంతము లేకుండెను. తుదకు రాముండు బ్రహ్మాస్త్రం బున రావణుని నేలఁబడ వేసెను. రావణుని వధించు రహస్యమార్గము విభీషణుండు శ్రీరామున కెఱింగించెనని యందురు. సర్వజ్ఞుండగు శ్రీరామునకవిదితవిషయముండునా! రావణుండు నేలఁబడి ప్రాణంబులు విడువకపూర్వము శ్రీరాముని విలోకించి యిట్లుపలికె. "రామా! నేను కృతార్థుఁడ నైనాఁడ. నా జన్మము ధన్యత వహించినది. నాయస్త్రవిద్యయు సఫలంబైనది. మజ్జనని నిక్కమైన వీరమాత. నీచేఁగూలి మోక్షమునందుటకే నేనట్టి యకార్యముఁజేసితిని. నీ కృపచేత నేను మోక్షము నందుదునుగాక." ఇట్లు పలికి రావణుఁడు ప్రాణములు విడిచెను. అగ్రజునిచేతఁ బరాభవింపఁబడినను, విభీషణునకు హృదయమున భ్రాతృప్రేమ మాత్రము పోలేదు. దశకంఠుని మరణమున కాతఁడనేక భంగుల విలపించి, శ్రీరామునిచే నోదార్పఁబడి, యగ్రజునకు ధర్మశాస్త్రవిధి నగ్నిసంస్కారాది క్రియల నిర్వర్తించెను.

అనంతరము శ్రీరామునియాజ్ఞ ననుసరించి, లక్ష్మణుఁడు పురమునఁ బ్రవేశించి, లంకారాజ్యమునకు విభీషణుని నభిషిక్తునిఁజేసెను.

# జానకీదేవి.

## ఇరువది యాఱవ ప్రకరణము.

### * అగ్నిప్రవేశము. *

రావణునివధ విని, యశోకవనమున జానకీమహాదేవి శ్రీరామచంద్రుని నెప్పుడు దర్శింతునోయని వేచియుండెను. ఇంతలో శ్రీరామునియాజ్ఞ ననుసరించి విభీషణుఁడామె సన్నిధికరుదెంచి, విజయవార్తను దెలిపి, యామెను శ్రీరాముని సన్నిధికిఁ దోడ్కొనివచ్చెను. రఘునందన ముఖారవిందసందర్శన మాచరించినప్పుడు జానకి పొందిన సంతోషమునకు మేరలేకుండెను. ఆమె నెమ్మదిగా శ్రీరాముని సమీపించి తత్పాదములకు నమస్కరించి యానందబాష్పములు విడిచెను. శ్రీరాముఁడు జానకి హృదయమును సంపూర్ణముగ నెఱుఁగును. కాని, యామె పాతివ్రత్యమును లోకమునఁ బ్రకటించుటకై యాతఁడామెను విలోకించి, ‹‹ తరుణీ ! రావణుఁడు నిన్నపహరించుకొనివచ్చినాఁడని విని, నే నూరకుంటినేని లోకులు నన్ను బలహీనుఁడని తలంతురేమోయని భావించి యాదైత్యుని సంగ్రామమునఁ గూల్చితిని. అంతియేకాని నిన్ను మరలఁ గైకొనుటకుఁ గాదు. క్రూరదైత్యునిచేఁ గొనితేఁబడి, యొక సంవత్సర

మచ్చటనున్న నిన్ను నేనొల్ల" నని గంభీరముగఁ బలికెను. మనోవాక్కాయకర్మల శ్రీరామునే నమ్మియున్న యా జానకికి రాముని పలుకులు ములుకులై తోఁచెను. ఆమె కన్నీరు గార్చుచు శ్రీరామునకుఁ దన హృదయము నెఱింగించి, యగ్ని రవులుకొలుపుమని విభీషణునకుఁ జెప్పెను. శ్రీరాముని యాజ్ఞఁ గైకొని విభీషణుఁడాకార్యము నొనర్చెను. ఇంత శ్రమపడి రావణునిఁ గూల్చి తుదకు శ్రీరాముఁడు జానకి విషయమున నిట్లుపలికెనుగదాయని లక్ష్మణహనుమదాదులు మిగులఁ జింతించుచుండిరి. అంతట జానకి శ్రీరామునకు నమస్కరించి, నింగిముట్టునట్లు జ్వాలలెగయుచున్న యగ్నిం బడెను. అగ్ని చల్లఁబడెను. చూపరులాశ్చర్యమందునట్లగ్ని జానకిం దెచ్చి శ్రీరామునకు నమస్కరించి, దేవా! రామచంద్రా! ఇదిగో! జానకీమహాదేవి. నీవు శ్రీమన్నారాయణుఁడవు. ఈమె లక్ష్మి. ఈమెను స్వీకరింపుము." అని పలికెను. ఆకాశమున నీ చిత్రమును జూచుచున్న దేవతలందఱును "జానకి మహాసాధ్వి" యని యేకగ్రీవముగఁ బలికిరి. శ్రీరాముఁడు సంతసించి జానకినిఁ జేపట్టెను.

# జానకీదేవి.

## ఇరువది యేడవ ప్రకరణము.

### * పట్టాభిషేకము. *

శ్రీరామచంద్రుఁడు సీతాలక్ష్మణోపేతుఁడై విభీషణ హనుమత్సుగ్రీవాదులు వెంటరా మహావైభవముతో నయోధ్యానగరముఁ బ్రవేశించెను. ఎంతకాలమునకు శ్రీరాముని జూడఁగంటిమని, కౌసల్యాదులుత్సాహమందిరి. "రామా ! నీ విమలకీర్తి యాచంద్రతారకముగ వెలయుఁగాక !" యని వసిష్ఠమునీంద్రుఁడు రాముని నాశీర్వదించెను. "మనముచేసిన ధర్మములు నేటికి ఫలించినవని పౌరజనులు సంతసించిరి. శ్రీరాముని రాకవిని సకల దేశాధీశులునువచ్చి పెక్కు కానుకలర్పించిరి. అంత వసిష్ఠుఁ డేర్పఱచిన యొక శుభదినమున శ్రీరామచంద్రుఁడిక్ష్వాకు వంశరాజ్యమున కభిషిక్తుఁడై యందఱకును నానందము గలుగఁజేసెను.

శ్రీరాముఁడు పట్టాభిషిక్తుఁడై ప్రజలఁ గన్నబిడ్డల విధమున జూచుచుఁ ధర్మపరిపాలన జేయుచుండెను. ఆతని ధర్మపరిపాలనమున, నెలకు మూఁడువానలు గురియుచుండెను.

వృద్ధులకుఁదప్పఁ దక్కినవారికి మరణము సంభవింపకుండెను. దున్నకుండనే భూమి ఫలించుచుండెను. సంతానములేని స్త్రీలులేరు. పుత్రశోకమునకుఁ బాల్పడువారులేరు. వితంతువులులేరు. భార్యాహీనులైన పురుషులులేరు. దరిద్రులులేరు. రోగములులేవు. జారచోరులులేరు. వేయేల! శ్రీరాముని పాలన ధర్మపరిపాలనమని వేనోళ్ళ శ్లాఘింపఁబడునట్లాతఁడు రాజ్యమేలుచుండెను.



# జానకీదేవి.

## ఇరువది యెనిమిదవ ప్రకరణము.

### * అపవాదము. *

"అక్కటా! పురమున వార్తల నరసిరమ్మని నన్నే యేల యీ శ్రీరామచంద్రుఁడు నియోగించె! నియోగించెఁ గాక! ఆ రజకులు దమలోఁదాము పోరాడుకొనుచు జానకీ మహాదేవి వృత్తాంతమునే యెత్తనేల! నేనిప్పుడేమిచేయుదును! ఈ వార్త నేను శ్రీరామునకుఁ జెప్పక యూరకుందమన్నచో విన్నవారెందఱోగలరు. నేను దాఁచినను దాఁగదు. ఆతనికిఁ దెలియువఱకును నేనూరకుంటినేని రాజకార్యమునం దశ్రద్ధవహించినవాఁడనగుదును. ఏమైనను జెప్పకతప్పదు," అని గూఢచారియగు భద్రుఁడు తనలోఁదాను తలపోయుచు, శ్రీరాముని సభామందిరమునకు వచ్చెను. అంతకు మున్నే శ్రీరాముఁడు సభాతలమునకువచ్చి భద్రుఁడెట్టివార్తలఁ దెచ్చునోయని వానిరాకకై వేచియుండెను. భద్రుఁడు శ్రీరామచంద్రునకు నమస్కరించి నిలుచుండెను. భద్రుని మోముఁ జూచినంతనే యాతఁడేదియో వింతవార్తఁ దెచ్చెనని రాముఁడు గ్రహించి యతనినిగాంచి, "భద్రా! నీవు నేఁడెట్టివార్తఁ దెలిసికొనివచ్చినాఁడవు? నీ మొగంబున విన్నఁ

దనంబు వహించియున్నది. ప్రజలనేక విధములఁ జెప్పుకొనుచుందురు. నీవు విన్నది యొక్కింతయు దాఁచక చెప్పు" మని పలికెను. భద్రుఁడు శ్రీరాముని విజయమునుగూర్చి పలు తెఱంగుల శ్లాఘించుచున్నారని నుడివెను. శ్రీరాముండంతమాత్రమునకుఁ దృప్తిఁబొందక, భద్రా! నీవు విన్నది దాఁచుచున్నావని తలఁతును. నీవు చెప్పినట్లు ప్రజలు నా విజయమును శ్లాఘించిన శ్లాఘింపవచ్చును. కాని నన్నుఁగూర్చిగాని, జానకినిగూర్చిగాని నిందలు పలుకక యుండరు. అట్టివి యేమైన విన్నచో నన్నృతమాడక తెలుపు" మనెను. రాముఁడిట్లడిగిన విని యాతఁడు రాముఁడారజకుల సంభాషణ మదివఱకే వినియుండెనని సంశయించి, తాను చెప్పకుండినచో బాగుండదని తలంచి, నెమ్మదిగా శ్రీరామభద్రునకిట్లని పలికెను. సపయాంతరంగుఁడైన భూపాలునిఁగాంచి, మెత్తనివాఁడని ప్రజలు పలుకుచుందురు. కఠిన దండనల విధించువానిని హింసాపరుఁడని తలంచుచుందురు. ధీరచిత్తునిఁ గఠినహృదయుఁడని భావింతురు. సజ్జనుల రక్షించువానిని బక్షపాతియందురు. ప్రజలనేక విధములఁ జెప్పుకొనుచుందురు. అందఱ మెప్పును వడయునట్లు రాజ్యపాలనముఁజేయుట కష్టము. అయినను ప్రజలాడుకొను వాక్యములు వినఁదలంచి యడుగుచున్నారు గాన చెప్పక తప్పదు. ఆకర్ణింపుఁడు. కళంకరహితమైన యిక్ష్వాకు వంశమున జన్మించిన శ్రీరాముఁడు, రావణునిచేఁ గొనిపోఁబడి యొక సంవత్సరము లంకయందుంచఁబడిన జానకిని మరలఁ దెచ్చు

కొని, యేలుచున్నాఁడని యెవ్వరో హీనకులజులు చెప్పు కొనుచున్నారు మహాప్రభూ!" యని భద్రుఁడు విన్న వించెను.

భద్రుని వాక్యములు శ్రీరాముని కర్ణములకు శూల ములవలె నాటెను. ఆతఁడొక్కింత సేపేమియు మాటా డక యుండి, యనంతర మేమి తలంచెనో కాని, తమ్ములను బిలుచుకొని రమ్మని భద్రున కాజ్ఞాపించెను. భద్రుఁ డరిగి రామానుజులకు రఘునందనుని యాజ్ఞఁ దెలిపెను.

ముప్పువ్వరు తమ్ములును శ్రీరాముని సన్నిధి కరుదెం చిరి. శ్రీరాముఁడు లోలోనఁ జింతించుచుఁ గొంతసేపటి వఱకును దమ్ములతో మాటాడక యుండెను. లక్ష్మణా దులు శ్రీరాముని మోముఁగాంచి యతఁడు చింతాక్రాంత చిత్తుఁడై యున్నట్లు గ్రహించి యందుకుఁ గారణ మేమై యుండునో యని యాలోచించుచుండిరి. ఇంతలో శ్రీరా ముఁడు తమ్ములనుజూచి యాసనాసీనులు గండని నియో గించి నెమ్మదిగా నిట్లు పలికె. "తమ్ములారా! నా యర్థ మును, ప్రాణమును, వేయేల? సమస్తమును మీరే యగు టచేతఁ, బ్రతి విషయమును మీ కెఱింగింపవలయునుగదా? రావణునిచేఁ గొనిపోఁబడిన జానకిని మరలఁ దెచ్చుకొని శ్రీరాముఁ డేలుకొనుచున్నాఁడని ప్రజలు చెప్పుకొనుచు న్నారు. ఆ మాటలు శూలములై నా హృదయమునఁ బ్రవేశించినవి" అని పలికి వెండియు లక్ష్మణు నవలోకించి యిట్లు వచించెను. "తమ్ముఁడా! లక్ష్మణా! రావణ వధా

నంతరమున జానకిని నే నొల్లనని పలికినప్పుడామె యగ్నిం బ్రవేశించుటయు, నగ్ని యామెం దెచ్చి యామె మహా సాధ్వియని చెప్పి నా కప్పగించుటయు, మింటనుండి దేవత లందఱును నాతని వాక్యములు సత్యమని నుడువుటయు నీ వెఱింగి యున్నావుకదా! ఏమైననేమి! ఇప్పుడు ప్రజ లిట్లాడుకొనుచున్నారు. పామరులాడు వాక్యములఁ బాటింపఁ బనిలేదని మీ రందురేమో! నిందఁ బొంది భూమిపై జీవించుటకన్న మృతినందుటయే మేలు. కావున నేను జానకినిఁ బరిత్యజించుటయే మంచిదని తలంచినాఁడ. దీని కెవ్వరును నడ్డుపెట్టవలదు. లక్ష్మణా! నీవు నన్నెడఁబాయ లేక నా వెంట వనంబుల కరుదెంచి నన్ను సేవించితివి. నా సౌఖ్యమే నీ సౌఖ్యముగ భావించితివి. ఎప్పుడును నా యాజ్ఞ దాఁటి యెఱుంగవు. కావున నే నిప్పుడు నీకు విధించు కార్యము నొనర్చి నా యపవాదముఁ బాపుము. మొన్నఁటి దినమున గంగాతీర ప్రాంతమునందున్న ముని పత్నులను సందర్శించి వచ్చుటకుఁ గోరిక కలదని జానకి నాతో జెప్పెను. ఇప్పుడు నీవా నెపంబున నామెను, వాల్మీకాశ్రమ ప్రాంతారణ్యమున విడిచి రమ్ము. ఇంక మాఱు పలుకకుము."

రాముని మాటలకు లక్ష్మణుం డేమియు నెదురాడలేఁ డయ్యెను. అతఁడు లోలోన మిగుల దుఃఖించెను. అంత నా మఱునాఁడు లక్ష్మణుఁడు రథమును సిద్ధపఱచి జానకి సన్నిధికరిగి తన చిత్తమునందున్న చింత యొక్కింతయు బయలు పఱుపక,

“తల్లీ! గంగాతీరముననున్న యాశ్రమములఁ జూచి వచ్చుటకు శ్రీరాముఁడు నిన్నుఁ దోడ్కొని పొమ్మని యాజ్ఞాపించినాఁడు. రథము దెచ్చినాను” అని పలికెను. ముందు వచ్చు సంగతి జానకి కేమి తెలియును? నిక్కముగా శ్రీరాముఁడు తన యభీష్టముఁ దీర్చుటకే యట్లు పంపుచుండెనని సంతసించి, మునిపత్నుల కీయఁదలంచిన వివిధ వస్తు భూషణాంబరములఁ గైకొని జానకి రథం బెక్కెను.

# జానకీదేవి.

## ఇరువది తొమ్మిదవ ప్రకరణము.

### * విచారము. *

అమాయకురాలగు జానకి కొంత దూర మేగువఱ కును సంతోషముతోడనే యుండెను. లక్ష్మణుఁ డామెకుఁ దటస్థించిన యాపదను మిగుల వగచుచుండెను. పోయిన కొలఁదిని మార్గమున వారి కనేక దుర్నిమిత్తములు దోఁచు చుండెను. అప్పుడు జానకి వానింగాంచి దిగులొంది లక్ష్మ ణుని విలోకించి ‹‹ లక్ష్మణా ! మనకన్నియు దుశ్శకునములే కనిపించుచున్నవి. లోకమంతయుఁ బాడయిన విధమునఁ దోఁచుచున్నది. నా మనోహరుండగు శ్రీరామమూర్తిని బాసి మునిపత్నుల సందర్శింపఁ దలంచి యేల బయలు వెడ లితి ? నే నట్టి కోరిక శ్రీరామునిఁ గోరినఁ గోరితిఁ గాక ! పతులు తెలివిమాలిన వారని తలంచి నన్ను వారింపక భర్త యేల యనుగ్రహించెను. ‹ నీ మనంబున నున్న యభీ ష్టముఁ దెలుపు ' మని నాథుఁడు నన్నడుగ బదునాల్గు వత్స రము లరణ్యమున వసించినది చాలక, మరల నిట్టికోరిక నేల

కోరితిని. కానిమ్ము. ఈ యపశకునముల వలన నాపద లేమియు రాకుండ శ్రీరాముని, నిన్నును, భరత లక్ష్మణులను, నత్తలను, దక్కిన బాంధవులను సకల దేవతలును రక్షించెదరుగాత!" అని పలికెను. జానకి చిత్తశుద్ధికి లక్ష్మణుఁ డాశ్చర్యమంది, లోకైక మాతయగు నామెను విధి యెప్పుడును నాథునిఁగూడి యుండునట్లు చేయక యెడఁబాపెనుగదా యని చింతించెను.

అంతలో రథము గంగాతీరమును జేరెను. గంగం జూచి జానకి యొక్కింత సంతసించుచు నద్దివ్యస్రవంతీ మహిమను లక్ష్మణునకుఁ జెప్పఁదొడఁగెను. లక్ష్మణున కా సమయమున సంతోషము కలుగునా? ఆమెను విడువవలసిన స్థలమదియే. శ్రీరామాజ్ఞ యామె కెట్లు తెలుపఁగలుగుదు నని చింతించుచు నాతఁడు కన్నీరు గార్చుచుండెను. మిక్కిలి దైన్యమున కాకరంబైన లక్ష్మణుని మోముఁజూచి జానకి భయంబంది, మెల్లఁగ నిట్లుపలికె. "సౌమిత్రీ! నీ మొగంబదియేమికారణముననో పురినుండి బయల్వెడలినప్పటి నుండియు విన్నఁదనమునే వహించి యున్నది. ఏల యీ రీతిఁ గన్నుల జలములఁ గార్చెదవు? సకల సంపదలను బాసి యన్నతో నరణ్యములకు వచ్చినప్పుడైనను, రణరంగమున నింద్రజిత్తుతోఁ బోరాడునప్పుడైనను, రావణుని శక్తి యుధంబున నాటినప్పుడైనను, నీవు కన్నీరు విడువలేదు. ఇప్పుడిట్లుండుటకుఁ గారణ మేమి? ఎట్టి చింతలనైనను బోఁగొట్టఁజాలిన భాగీరథిని జేరియుండియు నిట్టి చింతయేల?

ఈ నదిని దాటి తాపస స్త్రీల సందర్శించి త్వరగాఁ బోవుదము. అంతవఱకును నోపజాలవేని యిచ్చటనుండియే యయోధ్యకు మరలిపోవుదము."

కన్నులనుండి వచ్చుచున్న నీరముల నాపుకొని, "తల్లీ! నా కేమియుఁ జింతలేదు. మార్గమున మనకుఁ గలిగిన యపశకునములచేఁ జిత్త మొక్కింత కలఁతఁ జెందినది. ఈ గంగం దాటి మునిపత్నుల సందర్శించి వత్తువుగాక "మ్మని పలికి, రథం బచ్చటనుంచి, జానకిని నావపై నెక్కించి, యవ్వల తీరమున నొక యరణ్యమును జేర్చెను. శ్రీరాముఁ డామెను విడిచి రమ్మనిన స్థల మదియే. ఈ స్థలముఁ జేరిన తరువాత సౌమిత్రికి దుఃఖ మాఁగలేదు. అంతకంత కాతని దుఃఖము హెచ్చుచుండెను. శ్రీరాముని యాజ్ఞ యామెకుఁ దెలుపఁదలఁచి నెమ్మదిగా, "తల్లీ! నేను మహాశోకసాగరమున మునుఁగుకంటెను మరణమే మేలని తలంచుచున్నాను. జనాపవాదము నందుటకై నిన్నిట్లు దోడి తెచ్చిన నన్ను శాపముచేఁ జంపుము. నీ చరణ సన్నిధిని బ్రాణములు వాసి సుఖించెద" నని పలికెను. అతఁడీ మాటలఁ బలికినంతనే యవనిసుతయు మిగుల బెగడొంది "మఱఁదీ! సుమిత్రా కుమారా! ఎట్టి వేళలయందును నీవు ధైర్యము విడిచి యిట్లు చింతఁబొంది యెఱుఁగవు. నిన్ను సకల సద్గుణమూర్తిగా జను లెన్నుచుందురు. అట్టిచో నీ వెవ్వరికైన నెగ్గు సేసితివా? పరదార లెల్లరు నీకుఁ దల్లులు. పరధనము విషము. అసత్య మెఱుఁగవు. శ్రీరాముని సేవ

మఱచియుండవు. అట్టిచో జనులచే నిందింపఁబడు నకృత్యమేమియొనర్చితివి? రామాజ్ఞ లేకుండ నన్నుఁ దోడ్కొని రాలేదుకదా? తండ్రీ! సత్యమేమో తెలుపుము. నా హృదయమున నాందోళన మధికమగుచున్నది" యని వలికెను. శ్రీరామునియాజ్ఞ జానకికాతఁడు చెప్పకతప్పదయ్యెను. ఆతఁడు చిత్తమున ధైర్యమునిలిపి, యామె నరణ్యములఁ జేర్చిన కారణమును, రామునియాజ్ఞయుఁ దెలిపి పెద్దపెట్టున శోకించెను. ఆ మాటలు వినినంతనే యామె మొదలు నఱికిన కదళీతరువువలె నేలఁబడి మూర్ఛిల్లి కొంతసేపటికి లేచి, దుంఖించుచున్న లక్ష్మణునిగాంచి యిట్లనెను.

అన్నా! లక్ష్మణా! నీవు చింతింపకుము. రామాజ్ఞ దాఁటుట కెవ్వరితరము? ఇట్టి కష్టములఁ బడుమని విధాత నా నొసట వ్రాసియుండఁగా దానిని గడవఁగలనా? మున్నరణ్యవాసము చేసిన తరువాత కష్టములఁ గడచి గట్టెక్కితినని తలంచితినిగాని యింకలో నిట్లగునని కలలోఁగూడఁ దలంపలేను. పూర్వజన్మమున నే దంపతుల నెడబాపితినో యా పాపమిప్పు డనుభవించుచున్నాను. లక్ష్మణా! ఇంక శ్రీరామ పదారవింద సందర్శనము నాకు లభింపదా? చెప్పుము. ఇదిగో! శరీరము, అదిగో! గంగ. ఎట్లగునో యట్లగును. ఎవరో మూఢులాడుకొనిన వాక్యములఁ బాటించి, మమతను గూర్మిని విడిచి సంపూర్ణగర్భవతినైన నన్ను శ్రీరాముఁడిట్లు చేసెఁగదా! ఆకస్మికముగఁ గలిగిన యీ యపవాద కారణమున శ్రీరామచంద్రమూర్తి నాపైఁగల యనురాగము

మఱచెనుగా! అనసూయ మొదలైన మునిపత్నులు నా గుణములను వినుతించుట వినలేదా! లంకాపురమున నేను వహ్నిం బ్రవేశించుట చూడలేదా? దేవతలు జానకి నిర్దోషయని చెప్పినపల్కు లాలింపలేదా? ఇదంతయు నెఱిఁగి యుండియు క్షుద్రజనుల వాక్యముల విని యిట్టి తెగువఁ జేయఁదగునా! ప్రాణేశ్వరునిఁ బాసి వనముల కేలవచ్చితివని తాపసకాంతలడిగినచో నేనేమని ప్రత్యుత్తరమీయఁగలను?" అని పలికి వెండియు, "లక్ష్మణా! శోకావేశముచేత శ్రీరాము నుద్దేశించి యేవో కొన్నిమాటలాడితిని. నాకు మాత్ర మా మహాత్ముఁడు జననిందితుఁడగుట యిష్టమా? ఆతని యాజ్ఞఁ దలఁదాల్చి కానలఁ జరించెద. ఇంక నీవు విచార ముడిగి సాకేతమున కరిగి నా నాథునకు నమస్కారములని మనవిచేయుము. నిరంతరమును రామనామస్మరణమే నాకు దిక్కగుననుము. అత్తలకు మ్రొక్కితిననుము. భరతశత్రుఘ్నుల కాశీర్వచనములనుము. పోయిరమ్ము" అని దుఃఖముతోఁ జెప్పెను.

లక్ష్మణుఁడామెకుఁ జెప్పవలసిన మాటలన్నియుఁ జెప్పి, యామె యనుజ్ఞఁబొంది పోలేక ముందు వెనుకలు చూచుచు నామెను విడిచి చనెను.

# జానకీదేవి.

## ముప్పదియవ ప్రకరణము.

### * కుమారోదయము. *

లక్ష్మణుఁడు సాకేతమునకు మరలిపోయెను. జానకి యరణ్యమున నొంటిగనుండెను. ఆమెకుసంభవించిన ముప్పానకామెయే చింతింపవలయును. ఆమెయే యోదార్చుకొనవలయును. అచ్చట నామె యేడ్పువినువారెవ్వరు? ఒక్కప్పుడామె గంగంబడి ప్రాణములు గోలుపోవఁదలంచెను. కాని గర్భవతియగుటచే భ్రూణహత్యా దోషమునకు వెనుదీసెను. శ్రీరాముని గుణములను, ప్రేమను, చర్యలను దలంచుకొని పెద్దపెట్ట యేడ్వసాగెను. ఆ సమయమున నయ్యెడకు ఫలార్థమైయరగి వాల్మీకిమునీంద్రుఁ డా దేవివిలాపమువిని సమీపించెను. మహాదుఃఖ సాగరమున మునిఁగియున్న యామెకాతాపస దర్శనము పేదకుఁ బెన్నిధిలభించినట్లయ్యె. ఆ సాధ్వి యమ్మహాత్మునకు నమస్కరించెను. అమ్మునీంద్రుఁడామె యుదంతమంతయు దివ్యదృష్టినెఱింగి, తాను వాల్మీకియని యెఱింగించి యామెతో, "తల్లీ! భూపుత్రీ! జనాపవాదకు భీతిల్లి శ్రీరాముఁడు నిన్నిట్లుచేసినాఁడుగాని నీయందుఁ బ్రేమలేకకాదు. నీవాతని మదలఁ

గూడఁగలవు. నన్ను నిజజనకుఁడగు జనకునిగా భావింపుము. అమ్మా! నన్నుఁ గ్రొత్తవానిగఁ దలంపవలదు. నా యాశ్రమము నీదిగా భావింపుము. గుణవతులగు ముని కన్యలు నీకు వివిధోపచారములు చేయఁగలరు. నీవు మహాత్మచారిత్రవు. సంశయింపక నా యాశ్రమమునకు రమ్మని" పలికె. జానకి సమ్మతించి వాల్మీకివెంట నాశ్రమమున కరిగెను.

అట్లువాల్మీకి జానకిని దనయాశ్రమమునకుఁ దోడ్కొనిపోయి యామె వృత్తాంతమంతయుఁ దాపసకన్యల కెఱింగించి యామెను వారికప్పగించెను. మునికన్యలు జానకి కేవిధమయిన కొఱంతయుఁ గలుగకుండ సమస్తోపచారములును జేయుచు నామె చింతను బోఁగొట్టుచుండిరి. ఒకనాఁటి రాత్రి శుభలగ్నమున నామె యిరువురు కుమారులఁ గాంచెను. వాల్మీకి వారికిఁ గుశలవులను నామము లిడెను.

కుశలవులు దిన దిన ప్రవర్ధమానులగుచుఁ దల్లికి మోదము గల్గించుచుండిరి. ఆమెయుఁ గుమారులనుఁ జూచుకొనుచుఁ జింతను మఱచియుండెను. కాని శ్రీరామ దివ్యనామ స్మరణమాత్రమామె మఱచియుండలేదు. వాల్మీకి జానకీతనయుల కుపనయనమాచరించి, సకలాస్త్ర విద్యాధురీణులుగను, సమస్త విద్యావిశారదులుగను జేసెను.

ఇంతియెకాక, శ్రీరాముని దివ్యకథను గీర్వాణభాషను గావ్యముగా రచించి, దానిని వారికి నారదునిచే గానరూపకముగా నుపదేశము చేయించెను.

# జానకీదేవి.

## ముప్పది యొకటవ ప్రకరణము.

### * భూప్రవేశము. *

లోకాపవాదమునకు భీతిల్లి శ్రీరాముఁడు జానకిని బరిత్యజించెనే కాని, యామె విషయమున చింతమాత్రమాతని హృదయమును విడువలేదు. ఆతఁడు జానకిని మరల నెట్లు చూడఁగలుగుదునని యాలోచించుచునే యుండెను.

ఇట్లుండి, రావణుని వధవలనఁగలిగిన బ్రహ్మహత్యాపాతకముఁ బాపుకొనుటకు శ్రీరాముఁడు వసిష్ఠానుమతి నశ్వమేధయాగముసేయ సమకట్టెను. అయ్యధ్వరమునకు వివిధదేశాధీశులును, సకల మునులును నాహ్వానింపఁబడిరి. వాల్మీకియుఁ దన శిష్యులగు కుశలవులతో మఖసందర్శనార్థమై యరిగి యెట్లయిన నింక జానకిని శ్రీరామునితోఁ జేర్పవలయునని తలంచి, యక్కుమారుల విలోకించి, ‘‘ కుశలవులారా! మీకుపదేశింపఁబడిన రామాయణ కావ్యమును దినమున కిరువది సర్గల లెక్కను నధ్వరశాలయందును, రాజుల

విపుదలయందును, జన సమూహములయందును, శ్రీరాముని కొల్వుకూటమునను బాడుచుండుఁడు. మీరు ధనమున కాశింపకుఁడు. శ్రీరాముఁడు మీ యుదంతమడిగెనేని, వాల్మీకిమునీంద్రుని శిష్యులమని చెప్పుఁడు. ప్రజలకెల్ల రాజు తండ్రివంటివాఁడుగావున మీరు శ్రీరాముని దండ్రిగా భావింపుఁ" డని వచించెను. గురుఁడగు వాల్మీకియాజ్ఞననుసరించి కుశలవు లనుదినమును బ్రతిష్ఠలమున రామాయణము గానముసేయుచుండిరి. వారి గానమును విని యెల్లవారును నద్భుతమును సంతోషమును బొందుచుండిరి. వారి రూపములు శ్రీరామునివలెనున్నవని తలంచుచుండిరి. అట్లుండ నొక్క దినమున శ్రీరాముఁడు కొలువుదీర్చియున్న సమయమున నక్కుమారులు వీణాపాణులై యరిగి, తమ రామాయణ కావ్యగానమున నాతని నానందసాగరమున ముంచిరి. శ్రీరాముఁడు వారి తనూవిలాసములకును, గానమునకును సంతసించి యనేక మణిమయాభరణములు వారి ముందుపెట్టి " కుమారులారా! మీరెవ్వరు? ఈ కావ్యము రచించినవారెవరు?" అని ప్రశ్నించెను. " రాజా! వాల్మీకి శిష్యులము. ఈ కావ్యమును వాల్మీకి మహామునీంద్రుఁడే రచించెను. ఇయ్యది యిరువదినాల్గువేల శ్లోకములుగలిగి యేనువందల సర్గములుగలదై రాజిల్లుచుండును. పట్టాభిషేకపర్యంత మాఱుకాండము లున్నవి. అవ్వలి కథ యుత్తరకాండమున నున్నది. అమ్మునీంద్రుని దయవలన దీనిని మేము నేర్చుకొంటిమి. వినఁగోరిక యుండెనేని

వినుము. అరణ్యమున ఫలాశనులమైయుండు మాకు నీ బహుమతులతో నేమియుఁ బనిలేదు" అని కుశలవులు పలికిరి. నాఁటినుండియు ననుదినమును వారు శ్రీరాముని సన్నిధికరిగి గానము సేయుచుండిరి. ఇట్లనుదినమును కుశలవుల గానమును విని యానందించుచు నొక్క దినమున వారిరూపములు పరిశీలించిచూఁచి, తన యంతరంగమున, "అహో వీరి రూపములు జానకినలెనున్నవి. అమ్మానినీమణి వాల్మీకి యాశ్రమమున కవలఁ గనెనని వింటిని. వారే వీరేమై యుందురు. కాకున్నచో సామాన్యులకీ తేజముండునా? ఘోరారణ్యమున నా జానకి యీ కొమరులతో నెట్టికష్టములఁ బొందుచున్నదో కదా! ఆ కాంతను విడిచి యింత వఱకును సైఁచితిని. ఇంక నామెను జూడక నిల్వఁజాలను. ఎట్లయిన నామెను బిలిపించి, యీ ప్రజలముం దేదియైన సత్యము చేయించి, యామె పవిత్రచరిత్రయని నమ్మకము పుట్టఁజేసి, చేకొనవలయునని తలంచి, ప్రక్కనున్న శత్రుఘ్నునిఁ బిలిచి, "తమ్ముఁడా! నీవు వాల్మీకిసన్నిధికరిగి నా వాక్యములుగా నిట్లు చెప్పుము. జనాపవాదమునకు భయమంది జానకిని విడిచితిని. కావున సకల ప్రజలముందును నామెచే నేదేని సత్యము చేయించుటకుఁ దోడ్కొనివచ్చుట మంచిది." శత్రుఘ్నుఁడు వాల్మీకికడకరిగి రాముని పలుకులు చెప్పెను. వాల్మీకి సంతసించి వెంటనే తన శిష్యులను జానకిని దోడ్కొనివచ్చుట కాశ్రమమునకుఁ బంపెను.

వాల్మీకి యాశ్రమమునుండి, జానకి యరుదెంచెను. వాల్మీకి శ్రీరాముని యుద్దేశ మామె కెఱింగించెను. జానకి సత్యముచేయునని విని యందఱును దానింగాంచుటకు నియమిత సమయమునకుఁ జేరిరి. శ్రీరాముఁడును నా స్థలమును జేరి యాసీనుఁడై యుండెను. ఆ సమయమున జానకీ కుశలవ సమేతుఁడై వాల్మీకి యరుదెంచి రాముని పురోభాగమున నిలిచి ప్రజల కలకలమునువారించి, రాముంగాంచి మేఘ గంభీర నిస్వనంబున నిట్లు పలికెను.

" రామా ! ఈ జానకీ మహాదేవి పాతివ్రత్యమును గూర్చి నీ వెఱిఁగియుండియు, లోకాపవాదమునకు భీతిల్లితివి. ఈమె నా యాశ్రమంబున రక్షింపఁబడుచు నీ కుమారులగు కుశలవులఁ గనెను. వీరు నీ తనయులు. ఈ యమ్మయందు లేశమైనను దోషములేదు. కావున మువ్వరను జేపట్టుము. తపోధనుఁడనైన నేను జానకికొఱకసత్యమాడితినేని నా తపంబంతయు వ్యర్థమై పోవుఁగాక ! నా మాటలు నమ్మక నీ వింకను నీమెను బరీక్షచేయదలంతువేని యీామె నీ కిష్టమైన సత్యము చేయును."

ఆ మాటలు విని వాల్మీకింగాంచి ముకుళితకరకమలుఁడై రాముఁడు, " మునీంద్రా ! మున్ను లంకయందు జానకి మహాసాధ్వియని యగ్నిముఖంబునఁ గన్గొనియుండియు జనాపవాదమునకు భీతిల్లి కానలకంపితిని. ఈమె నిశ్చయముగా సాధ్వియే. వీరిరువురును నా పుత్రులే. అయినను